29.7.1994 శుక్రవారం, 16 పేజీలు, సంపుటి: 65, సంచిక: 30, విడిప్రతి : రు. 2.00లు

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

Phone : 27354 Regd. No. HNL 18



# అల్లుడికో 'కోట్ల' పోగు: కృష్ణపట్నం

నెల్లూరీయులు ఎంతో కాలంగా ఆశతో ఎదురు చూస్తున్న కృష్ణపట్నం థర్మల్ విద్యుత్ కేంద్రం ఆదిలోనే వివాదాల ఊబిలో చిక్కుకుంది. ప్రైవేటు రంగంలో నెలకొల్పబడే వెయ్యి మెగా వాట్ల విద్యుత్ కేంద్రం టెండర్ల అప్పగింతలో అవకతవకలు జరిగాయని మంత్రి మండలి సమావేశంలో సాక్షాత్తు మంత్రులే ముఖ్యమంత్రి పై ధ్వజమెత్తడంతో ఈ వివాదం రచ్చకెక్కింది. "కోట్లమాయ్య" టెండర్లు కోర్టుకెక్కితే రద్దయ్యే ప్రమాదం వుందని, ముందు జాగ్రత్తగా



వ్రతం చెడినా ఫలం దక్కేనా?

వీటి స్థానంలో తిరిగి టెండర్లు పిలిచావాలని కొందరు మంత్రులు చేసిన సూచనను ముఖ్యమంత్రి తిరస్కరించారు. ఇటీవల తెలుగు గంగ టెండర్ల గోల్‌మాల్ పై కనీసం విచారణ కూడా జరపకుండా అప్పటి కప్పుడు స్పందించి టెండర్లను రద్దు చేసిన ముఖ్యమంత్రి ఎందుకనో కృష్ణపట్నం విషయంలో రాజీ పడలేక పోయారు. మంత్రి వర్గంలో నెంబర్ టూగా వున్న కొణిజేటి రోశయ్య కూడా కృష్ణపట్నం టెండర్లు రద్దు చేసి చేతికి బురద అంటకుండా జాగ్రత్త పడమని ముఖ్యమంత్రికి సవినయంగా మనవి చేసుకున్నా ఆయన మాత్రం పరోకదాన్ని జి.వి.కె. ఇండస్ట్రీస్‌కు కేటాయిస్తూ వారం క్రితం తీసుకున్న నిర్ణయాన్ని మంత్రివర్గం చేత పట్టిన పట్టు వదల్లేదు. ఈ టెండర్లను ఆమోదించటమే ముఖ్యమంత్రి అభిమతమైతే తన ప్రమేయం లేదని "నిరసన"ను రికార్డు చేయాలని సంక్షేమ మంత్రి పి. జనార్దన రెడ్డి చేసిన అభ్యర్థనను ముఖ్యమంత్రి కోపంగా తిరస్కరించారు. మన జిల్లా మంత్రి పసల పెంచలయ్య, పంచాయితీ రాజ్ మంత్రి డి.కె. సమరసింహారెడ్డి కూడా వివాదాత్మక టెండర్లను రద్దు చేసి మిస్టర్ క్లీన్‌గా నిలబడాలని ముఖ్యమంత్రికి బుజ్జగింపుగా చెప్పినా ఫలితం లేకుండా పోయింది. వెయ్యి మెగా వాట్ల సామర్థ్యం కలిగిన విద్యుత్ కేంద్రాన్ని 500 మెగా వాట్ల వంతున రెండుగా విభజించి ఒకదాన్ని అమెరికాకు చెందిన మెసర్స్ బ్రూక్లిన్ మెరైన్ అండ్ ఆయిల్ ఐన్ కు ఆమోదింప జేయటంతో ముఖ్యమంత్రి "విజయు"డయ్యారు.

కాగా అమెరికాకు చెందిన బ్రూక్లిన్ కంపెనీకు మన దేశంలో ప్రతినిధిగా [illegible] సాక్షాత్తు ముఖ్యమంత్రి అల్లుడు కావటం, జి.వి.కె. ఇండస్ట్రీస్ అధినేతకు, రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి మధ్య బంధుత్వం వుండటం యాదృచ్ఛికమే అనుకొన్నా అనుకోవచ్చుకానీ టెండర్ల రచ్చతో ఈ బంధుత్వాలకు "ఆశ్రిత పక్షపాతం" జబ్బు సోకింది. ఈ వివాదం ఎటు తిరిగి ఎటు మళ్లుతుందో తెలీదు కానీ కృష్ణపట్నం థర్మల్ కేంద్రానికి, నెల్లూరు జిల్లా ప్రయోజనాలకు అచ్చితంగా గండిపడే ప్రమాదం కనిపిస్తోంది.

కొరవ 10 పేజీలో

## ఈ ప్రశ్నకు బదులేది?

1. రామగుండం థర్మల్ విద్యుదుత్పాదన కేంద్రం 2 x 500 మెగావాట్లుగా వున్న యూనిట్లను కలిపి 500 మెగావాట్ల ఒకే యూనిట్‌గా చేసి బి.పి.ఎల్. సంస్థకు అప్పగించారు. కానీ వెయ్యి మెగా వాట్లుగా ఒకే యూనిట్‌గా వుండాల్సిన కృష్ణపట్నం కేంద్రాన్ని (2 x 500 మె.వా.) రెండు భాగాలుగా ఎందుకు విభజించాల్సి వచ్చింది. టెండర్లు వేసిన అపోలో హాస్పిటల్ గ్రూపు వారికి 3,500 మెగావాట్ల విద్యుత్ కేంద్రం ఏర్పాటుకు సామర్థ్యం, వనరులు వున్నా దాన్ని ఎందుకు విస్మరించారు?

కొరవ [illegible] పేజీలో

## పి.వి. కావాలనే నానుస్తున్నారా?

# పిసిసి వినాయకుడి పెళ్లి!

ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహ రావు నాన్చుడు ధోరణి వల్ల వచ్చే ఎన్నికల్లో రాష్ట్రంలో కాంగ్రెస్‌కి నూకలు చెల్లేట్లు కన్పిస్తోంది. రాష్ట్రంలో కాంగ్రెస్ పరిస్థితి అధ్వాన్నంగా వుంది. మర్రి తులసీదాస్ సారథ్యంలో పార్టీ ఇప్పటికే గబ్బు పట్టి పోయింది. మర్రి పదవీ కాలం పూర్తయి నెలలు గడుస్తున్నా కొత్త అధ్యక్షుడి ఊసు కూడా లేకుండా పోయింది. పార్టీ అధ్యక్షుడ్ని మారుస్తామనో లేక మార్చేది లేదనో అధిష్టాన వర్గం ఇంత వరకు స్పష్టంగా ప్రకటించ లేదు. మర్రితో గిట్టని ముఖ్యమంత్రి మాత్రం పిసిసి అధ్యక్షుడి మార్పు అనివార్యమని అంటున్నా ఢిల్లీ నుంచి దీనికి తగిన ప్రతిస్పందన కన్పించటం లేదు. మరో



మూడు నెలల్లో ఎలాగూ ఎన్నికల నోటిఫికేషన్ వెలువడుతుంది కాబట్టి అలాగా పిసిసి అధ్యక్షుడ్ని మార్చి అనవసరమైన వివాదాల్లో తలదూర్చడం ఎందుకని ప్రధాన మంత్రి తాత్సారం చేస్తున్నట్లు ఢిల్లీ వర్గాల భోగట్టా. దీంతో రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి అధ్యక్షుడు ఉన్నట్టా? లేనట్టా? అన్న సంశయం కలుగుతోంది. ముఖ్యమంత్రి వర్గీయులు మర్రిని పిసిసి అధ్యక్షుడిగా గుర్తించడం మానేశారు. మర్రి మాత్రం ఇదేం పట్టించు కోకుండా తన సహజ ధోరణిలో పిసిసి సారథ్యం వెలగ బెడుతున్నారు. ముఖ్యమంత్రికి, పిసిసి అధ్యక్షుడికి మధ్య మునుపటి మాదిరిగానే వైరం తీవ్ర స్థాయిలో వుంది. ఎన్నికల వరకు కూడా మర్రి

కొరవ 10 పేజీలో

# రాజీవ్‌ను ఏమన్నాడని ఆర్వీ మీద ఇంత దుమారం?

ఆర్.వెంకట్రామన్ 'మై ప్రెసిడెన్షియల్ ఇయర్స్' మీద రాజీవ్ భక్తులు కత్తులు నూరుతున్నారు. పుస్తకాన్ని నిషేధించాలని వీరావేశం ప్రదర్శిస్తున్నారు. పుస్తకంలో రాజీవ్‌ను ఆర్వీ ప్రశంసించినా వీరు ఇంతగా ఎందుకు విరుచుక పడుతున్నారు? రాజీవ్ మీద 'రాజును మించిన రాజభక్తి' ప్రదర్శిస్తున్న ఈ నాయకులు తమ విభేదాలకు, ముఠా రాజకీయాలకు, పరస్పర వైరాలకు దీన్ని రంగంగా తయారు చేసుకుంటున్నారా?

మాజీ రాష్ట్రపతి ఆర్.వెంకట్రామన్ రాసిన ''మై ప్రెసిడెన్షియల్ ఇయర్స్'' (My Presidential Years) మీద రేగుతున్న దుమారం (దాన్ని వివాదం అనడం కంటె దుమారం అనడమే సబబు) చూసి నవ్వనైనా నవ్వవచ్చు. ఏడవనైనా యేడవచ్చు ; లేక అది తాజా కాంగ్రెస్ సంస్కృతికి నిదర్శనమని సరిపెట్టుకోనూవచ్చు. పుస్తకం ఇంకా మార్కెట్లోకి రాకముందే ప్రొఫెసర్ కె.కె. తివారీలాంటి దుడుకుపిండం దానిపై ధ్వజమెత్తడాన్ని అర్థం చేసుకోగలం. ప్రొఫెసర్ సుబ్రహ్మణ్య స్వామిలాంటి వివాద ప్రియుడు కాంగ్రెస్ వకాల్తా పుచ్చుకొని ఆర్వీ మీద బాణాలు విసరడాన్ని కూడా సరిపెట్టుకోవచ్చు. కరకు విశ్లేషణాత్మక అవగాహన కల్గిన కాంగ్రెస్ మేధావిగా ముద్రపడిన వి.ఎన్. గాడ్గిల్ విరుచుక పడడాన్ని కూడా అర్థం చేసుకోవచ్చు. కాని పి.వి.



నరసింహారావు అంతటి అనుభవశాలి, సంయమనశీలి, స్థితప్రజ్ఞుడు కొలువు దీరిన ఎఐసిసి కార్యవర్గ సమావేశమే ఆ పుస్తకాన్ని, అందులో రాజీవ్‌గాంధీపై అనుచిత వ్యాఖ్యలు చేశాడనుకొని ఆర్వీని తూర్పార బట్టడాన్ని ఎట్లా అర్థం చేసుకోవాలి ?

ఇంతకూ 'మై ప్రెసిడెన్షియల్ ఇయర్స్' లో రాజీవ్ గాంధీని ఆర్వీ విమర్శించాడా, లేక 21 వ తేదీ రాత్రి టి.వి.లో ప్రసారమైన 'ఐ విట్నెస్' కార్యక్రమంలో వ్యాఖ్యానించాడా అన్నది కూడా తెలుసుకోకుండా ఎఐసిసి సభ్యులు కోపావేశాన్ని ప్రదర్శించడం విడ్డూరమే కాదు, విపరీతంగానూ వుంది. రెంటినీ కలగాపులగం చేసి, అక్కడ రాసిన దాన్ని ఇక్కడ, ఇక్కడ అన్నదాన్ని అక్కడ కోట్ చేసి, మొత్తం మీద మరో వివాదాన్ని సృష్టించడానికి ఈ ప్రబుద్ధులు ప్రయత్నిస్తున్నట్టు స్పష్టమవుతూనే వుంది.

'మై ప్రెసిడెన్షియల్ ఇయర్స్' లో ఆర్వీ రాజీవ్ గాంధీని వాత్సల్యంతో ప్రస్తావించారే తప్ప ''నిర్దాక్షిణ్యం'' గా ఎక్కడా విమర్శించ లేదు. వయస్సులో పిన్న అయినా ఎంతో నిండుదనం, ఒక్కోసారి నిబ్బరం ప్రదర్శించే వాడని రాజీవ్‌ను ఆయన ప్రశంసించాడు. ''మిసమిసలాడే యవ్వనం, అందమైన ఆ వదనంపై ఎప్పుడూ తొణికిసలాడే చిరునవ్వు, ఆహ్లాదకరమైన ప్రవర్తన'' అంటూ రాజీవ్‌ను కవితాత్మకంగా వర్ణించాడు. ''మానవ సమస్యలపై మంచి అవగాహన, సునిశితమైన మేధస్సు, బడుగు వర్గాలపై కొండంత సానుభూతి'' వున్న రాజీవ్‌ను 'డార్లింగ్ ఆఫ్ ది మాసెస్' (Darling of the masses) అని కూడా కీర్తించాడు. రాజీవ్ దృష్టి ఎప్పుడూ 21 వ శతాబ్దం వైపే వుండేదని, అందుకే అరకొర జ్ఞానుల్ని చూస్తే ఆయనకు అసహనం ఉబికి వురికేదని ఆర్వీ మెచ్చుకున్నాడు. అంతర్జాతీయ వ్యవహారాల్లో రాజీవ్ చూపిన చొరవను, అవగాహనను ప్రశంసిస్తూ, అణ్వాయుధ నిషేధానికి ఆయన చేసిన 'ఐదు ఖండాలు- ఆరు దేశాల' ప్రతిపాదన గోర్బచేవ్‌తో కలిసి ప్రకటించిన ఢిల్లీ డిక్లరేషన్ ఆయనకు అంతర్జాతీయ రాజనీతిజ్ఞుడుగా గుర్తింపు తెచ్చాయని ఆర్వీ అన్నాడు. ఐక్యరాజ్యసమితి, కామన్‌వెల్త్ దేశాధినేతల సమావేశం, అలీనోద్యమ సమావేశాలు, నిరాయుధీకరణకు, పరిసరాల పరిరక్షణకు సంబంధించిన సదస్సుల్లో రాజీవ్ ప్రసంగాల్ని దేశదేశాల ప్రతినిధులు ''అపూర్వ గౌరవప్రదంగా'' ఆలకించే వారని కూడా ఆయన పుస్తకంలో పేర్కొన్నారు.

దేశ వ్యవహారాల్లో కూడా రాజీవ్‌పై ఆర్వీ ప్రశంస వర్షమే కురిపించారు. అంతర్జాతీయ రంగంలో సాధించిన విజయాలకు ఏమాత్రం తీసిపోని విధంగా జాతీయ వ్యవహారాల్లో రాజీవ్ రాణించాడని ఆయన రాశారు. అస్సాంలో అల్లకల్లోలాన్ని అంతం చేసి ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించిన ఖ్యాతి రాజీవ్‌దేనని ఆయన వ్యాఖ్యానించారు. పంజాబ్‌లోనూ లోంగోవాలా హత్య[illegible] గురి కాకుంటే ఆయనతో రా[illegible] కుదుర్చుకొన్న ఒప్పందం శాంతిని నెలకొల్పి వుండేదని ఆర్వీ అభిప్రాయపడ్డారు.

ఈ మాటల్లో ప్రశంసే కాదు, ప్రేమాభిమానాలు కూడా ధ్వనిస్తున్నాయి. రాజీవ్ మీద వెంకట్రామన్‌కు గౌరవంతోపాటు పుత్ర వాత్సల్యంలాంటిది కూడా వున్నట్టు అనిపిస్తుంది. ఐతే మన కాంగ్రెస్ ఉడుకు పిండాలకు ఇవేమీ పట్టలేదు. 21 వ తేదీ రాత్రి దూరదర్శన్‌లో ప్రసారమైన 'ఐ విట్నెస్' ఇంటర్వ్యూలో ఆర్వీ యథాలాపంగా చేసిన వ్యాఖ్యలే వాళ్ల చెవులకెక్కాయి. అందులోనూ ఆయన రాజీవ్‌ను

కొరవ 6 పేజీలో

**సూటి ప్రశ్న**

గిద్దలూరు గోపాలరావు

ఆకలి [illegible]
ఆర్పేవారెరి?
మత కలహాలు
మాన్పేవారెరి?
ఈ సూటి ప్రశ్నలకు
దిటవైన జవాబు
లభిస్తుందా ఏరోజైనా!
రోజుల్లో కాకున్నా
ఏ యుగం లోనైనా!

# నెల్లూరుతో చలం అనుబంధం

**స్త్రీ స్వేచ్ఛ కోసం కలలు కని కలం పట్టిన తొలి రచయిత చలం శతజయంతి సందర్భంగా**

ఉద్యోగరీత్యా చలం ఆంధ్ర దేశమంతా తిరిగాడు. ప్రతి ఊరినీ తన రచనలో ఎక్కడో ఒక చోట వర్ణించాడు. మరి భీముని పట్నాన్నయితే ఏ కాశ్మీర్ అన్నంత గొప్పగా వర్ణిస్తాడు 'జీవితాదర్శం' లో. కాని నెల్లూరు మాత్రం - ఏ ఒకటి రెండు కథల్లో ప్రస్తావన తప్ప - మరెక్కడా కనబడదు చలం రచనల్లో!

నిజానికి ఆయన నెల్లూరులో



ఒక్క సంవత్సరం వున్నారు.

1935 లో బెజవాడ నుంచి నెల్లూరు జిల్లా కనిగిరికి బదలీ అయింది. ''కనిగిరి బావుంటుంది - సిల్లు, కూరలు దొరకవు. కోళ్లు, ఆడపిల్లలు, కొండలు ప్రేమించే నా వంటి వాడికి బావుంటుంది...'' అని రాశాడు.

తర్వాత 1936 లో నెల్లూరుకి ట్రాన్స్‌ఫర్ అయింది. చలం జీవితంలో చాలా ప్రాముఖ్యం కల్గిన సంవత్సరం అది, తొలి సారిగా రమణాశ్రమానికి వెళ్లింది ఆ సంవత్సరంలోనే.

నెల్లూరులో కపాడిపాళెంలో ఒక చిన్న మిద్దె యింటిలో వుండేవాడట చలం. విమలేందు బోస్ అనే బెంగాలీ యువకుడొకడు అప్పట్లో వాళ్లతో వుండేవాడట. ఈ బోస్‌ను గూర్చి 'సొరిస్' అనే పుస్తకంలో అ. సూర్యనారాయణ ఇట్లా రాశాడు- ''త్యాగాలు చేసో చెయ్యకో గొప్ప పేరు తెచ్చుకొన్న పొణకా కనకమ్మ గారు బోసును నెల్లూరికి పిలిపించింది. అతను రెవల్యూషనరీ అని తెలియగానే అర్ధరాత్రి సామానంతా రోడ్డు మీద పడేసి అతన్ని పొమ్మంది. దాంతో ఆయన చలంగారి గెస్టుగా వచ్చి వుంటున్నాడు!'' ఇది ఎంత వరకు నిజమో తెలియదు. కనకమ్మ గార్ని 'త్యాగాలు చేసో చెయ్యకో గొప్ప పేరు తెచ్చుకున్న' దనడం ఆ రచయిత అజ్ఞానానికి దుందుడు తనానికి నిదర్శనం.

ఏమైతేనేం, ఈ బోసు గారి కోసం చలం గారింటికి రోజూ సి.ఐ.డి.లు వచ్చే వారట. వాళ్లలో ఒక సి.ఐ.డి. చలంకు సొరీస్‌కు, కడకు ఆ బోసు క్కూడా బాగా స్నేహమై పోయాడట. ''నెల్లూరు సనాతనులు పదిహేను రూపాయ లిస్తామని బోస్ చేత నాట్యాలు చేయించుకుని.... డబ్బు ఎగ్గొట్టార''ట. ఆ సనాతను లెవరో ఆ నాట్యాలేమిటో తెలియదు.

నెల్లూరులో చలం గార్ని చూడ్డానికి చాలా మంది వచ్చేవారట. ''బెల్లం చుట్టూ ఈగల్లా చీమల్లా చేలం చుట్టూ చేరే వారు అదే పనిగా మనుషులు''.

చలం నెల్లూరులో ఉండగా ఒకసారి - 1936 డిసెంబరులో - సెలవులకు బెజవాడ వెళ్లి, అక్కణ్నుంచి చింతాదీక్షితులు గారితో తిరువణ్ణామలై వెళ్లాడు. చలం జీవితంలో రమణాశ్రమం చూడ్డం అదే తొలిసారి. ఏమీ తోచక, సరదాకు, దీక్షితులు గారి కోసం ఆయన వెంట వెళ్లాడే కానీ, అప్పట్లో రమణా శ్రమం ప్రభావం చలం మీద బొత్తిగా లేదు. ఏమైనా అది చలం జీవితంలో ఒక గొప్ప మలుపుకు నాంది. అది ఆయన నెల్లూరులో ఉన్న కాలంలో జరగడం విశేషం. అదీ చలంతో నెల్లూరికి అనుబంధం.

అంతకూ చలం ఆత్మకథలో నెల్లూరు ప్రస్తావన ఎక్కడా కనపడదు. ఆయన ఒక హరిజన వాడలో కాపురం పెట్టడం, ఒక క్రైస్తవ యువతి చేత వంట చేయించు కోవడం - వీటికి నెల్లూరు ఛాందసు లెట్లా రియాక్టయ్యారో తెలియదు. ఆ రోజుల్లో అది గొప్ప సంచలనం కల్గించి వుండాలి కదా?

(1979 జూన్ 11 తేది 'జమీన్‌రైతు' లో 'మాట కచేరి' శీర్షిక నుండి)

# ఆయుధం పై పోరాటం

రాయలసీమ నాలుగు జిల్లాలు, గుంటూరు, ప్రకాశం జిల్లాల్లోని కొన్ని ప్రాంతాల్లో ఆయుధాల లైసెన్సుల్ని ఆరు నెలలపాటు రద్దు చేస్తూ ప్రభుత్వం జారీ చేసిన ఉత్తరువు మంచి ఫలితాన్నే ఇస్తున్నది. ఇప్పటికిప్పుడే 50 శాతం ఆయుధాలు ప్రభుత్వానికి స్వాధీనమైనట్లు అధికారులు ప్రకటించారు. ఆగస్టు 1 వ తేదీలోగా స్వచ్ఛందంగా ఆయుధాలను అప్పగించకపోతే ప్రభుత్వమే వాటిని స్వాధీనం చేసుకోవడమే కాక, వాటి సొంతదారుల లైసెన్సులు శాశ్వతంగా రద్దుచేసి, వారి మీద కేసు కూడా పెడ్తామని ప్రభుత్వం హెచ్చరించింది. ఏ జిల్లాలో ఎన్ని లైసెన్సులున్నదీ, ఎవరి వద్ద వున్నదీ పోలీసుశాఖ వద్ద లెక్కపక్కలు ఉన్నాయి గనక, దాచి పెట్టుకోవడం, ప్రభుత్వానికి అప్పగించకుండా మభ్యపెట్టడం వీలయ్యే పనికాదు. అందువల్ల గడువు లోపల ఆయుధాలన్నీ పోలీసు స్టేషన్లకు చేరగలవని నమ్మవచ్చు. ఒక్క రాయలసీమ జిల్లాల్లోనే 4913 ఆయుధాల లైసెన్సులున్నాయని అధికారుల లెక్కలు చెప్తున్నాయి. గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో మరో రెండు వేలదాకా వుంటాయి. మొత్తంమీద ఈ ఏడువేల లైసెన్సుల్ని రద్దు చేయడం, ఆయుధాల్ని స్వాధీనం చేసుకోవడం అసాధ్యమేమీ కాదు. కానీ ఆ తర్వాత ఏమిటన్నదే ప్రశ్న. ముఖ్యంగా రాయలసీమ జిల్లాల్లో ఆయుధాల బెడద అంతా ఇంతా కాదు. లైసెన్సు అన్నదొక సాకు, లేదా ఒక అండ. ఒక లైసెన్సుడ్ తుపాకి వెనక కనీసం పాతిక అన్‌లైసెన్సుడ్ ఆయుధాలు వుండడం ఆ ప్రాంతంలో పరిపాటి. నిజానికి నేరాలకు ఉపయోగ పడేది లైసెన్సుడ్ మారణాయుధాలే. 'ఓబయ్యకాలం' నాటి లైసెన్సుడ్ ఆయుధాలు అన్‌లైసెన్సుడ్ ఆయుధాలను రక్షించుకోవడానికి, నేరాలు మొయ్యడానికి మాత్రమే ఉపయోగ పడుతున్నాయి. సాధారణంగా ఘర్షణల్లో, హత్యాకాండల్లో అధునాతన అన్‌లైసెన్సుడ్ ఆయుధాలను ఉపయోగించి, కేసుల్లో మాత్రం లైసెన్సుడ్ ఆయుధాల్ని చూపుతుంటారు. ఈ తేడా వల్లనే తరచు కేసులు తేలి పోతుంటాయి. ఆత్మరక్షణ అనే సాకుతో తీసుకునే లైసెన్సు ఇట్లా విధ్వంసానికి, [illegible] ఉపయోగ పడుతున్నాయి.

ప్రభుత్వం [illegible] లైసెన్సుల్ని రద్దు చేయడంతో అన్‌లైసెన్సుడ్ ఆయుధాలకు ఇబ్బంది ఏర్పడే సట్లయింది. యథేచ్ఛగా అన్‌లైసెన్సుడ్ ఆయుధాలతో స్వైర విహారం చేసే అవకాశం లేకుండా పోయింది. లైసెన్సుల్ని ఉపయోగించకొని దొంగ ఆయుధాలతో ఆటవిక రాజ్యాలను ఏలే అదను తప్పిపోయింది. 'ఫ్యాక్షన్' ఒక ఫ్యాషన్‌గా చెలామణి అవుతున్న రాయలసీమ జిల్లాలకు ఇది కంటకప్రాయంగానే వుంది. ఆయుధాల లైసెన్సులు తుట్టుమారా రద్దు చేస్తే మా గతేంకాను అని రాయలసీమ నాయకులు ముఖ్యమంత్రికి మొర పెట్టుకొన్నారంటే అక్కడి రాజకీయాలు ఎంత ఆయుధాధారంగా నడుస్తున్నాయో ఊహించుకోవచ్చు. రాష్ట్రం మొత్తం మీద అన్ లైసెన్సుడ్ ఆయుధాల సంఖ్య 35 వేలకు మాటేనని పోలీసు వర్గాలు అంటున్నాయి. వాటితో పోలిస్తే మన పోలీసు బలగం ఏపాటి? వాళ్ల వద్ద వున్న ఆయుధాలు ఏ పాటి? రాష్ట్రంలోని తొమ్మిది దళాలలో వున్న పోలీసుల సంఖ్య 11 వేలు. వారి వద్ద వున్న 11 వేల ఆయుధాలతో ఈ 'తుపాకి వీరుల్ని' ఎదుర్కొనడం, కనీసం అదుపు చెయ్యడమైనా సాధ్యమా?

లైసెన్సులు తాత్కాలికంగా రద్దు చేయడంతో సరి కాదు. దొంగ తుపాకుల్ని అరికట్టడం ముఖ్యం. లైసెన్సుల రద్దుతోనే దొంగ తుపాకులు మాయమై పోతాయనుకోవడం భ్రమ. ప్రతి రాచబాటకూ ఎన్నో అడ్డదారులు, చెడ్డదారులూ వుంటాయి. ఇప్పుడు తుపాకీ వీరులు వెతుకులాడుతున్నది ఆ దారుల కోసమే! ముందుగా తమ దొంగ తుపాకుల్ని కాపాడుకోడానికి వాళ్లు ప్రయత్నిస్తున్నారు. అది వీలు కాకపోతే ఆయుధం మారుతుందే కానీ ఆటవిక న్యాయం మాత్రం తీరదు.

**జమీన్‌రైతు**

రాయలసీమ జిల్లాల్లో శాసనసభ్యులు, పార్లమెంట్ సభ్యులే కాదు. సాదా సర్పంచ్ సైతం వీధిలోకి రావాలంటే ముందు వెనుకల సాయుధ సిబ్బంది తప్పనిసరిగా వుండాలి. ఏ అధికారం, ఏ పదవీ లేని వారికి కూడా ఈ సాయుధ రక్షణ వుంటుంది. ప్రజా ప్రతినిధులకు ప్రభుత్వమే సాయుధ సిబ్బందిని యిస్తున్నా - దానికి రెండు మూడింతలు సొంత దళాన్ని వాళ్లు సమకూర్చుకుంటున్నారు. ఇక్కడ హత్యలు జరుగుతూనే వున్నాయి. తూటాలు పేలుతూనే వున్నాయి. ఇదంతా అన్‌లైసెన్సుడ్ ఆయుధాల వల్లనే వీలవుతుందని రాయలసీమ రాజకీయాలు తెలిసిన వాళ్లకు తెలతెల్లమే! అందువల్ల లైసెన్సులు రద్దు చేసినంత మాత్రాన్నే దొంగ తుపాకుల రద్దయి పోతాయని ఆశించడం, అల్లు అలకగానే పండగ అయిందను కొన్నట్టు వుంటుంది. అందువల్ల ప్రభుత్వం ఇప్పుడు నిఘా వేయాల్సింది దొంగ తుపాకుల మీద. ఏదో ఒక ముసుగులో అవి స్వైర విహారం చేసే ప్రమాదాన్ని ప్రభుత్వం అరికట్ట గలగాలి.

ఆయుధమంటే తుపాకి ఒక్కటే కాదు. తుపాకిని రద్దు చేస్తే కత్తులు, బరిసెలు, మందుపాతరలు, ఇంకా ఎన్ని లేవు నరుక్కోడానికి, కక్షలు తీర్చుకోడానికి! వాటిని అరికట్టాలంటే పోలీసు పటిష్టం కావాలి. అంతకన్నా ముఖ్యంగా రాజకీయాల ప్రక్షాళనం కావాలి. నాయకుల దృక్పథంలో మార్పు రావాలి. అది జరుగుతుందా? రాయలసీమ రక్త పంకిల రాజకీయంలో సుహృద్భావ వీచికలు వీచే రోజు వస్తుందా?

# పసిపిల్లల మీదనా ప్రయోగాలు!

ఒకటి, రెండు తరగతులకు ప్రభుత్వం ప్రవేశ పెట్టిన పుస్తకాలు చూస్తుంటే ఆశ్చర్యం కలుగక మానదు. పుస్తకం మొదటి పేజీలో పాటలు ఇచ్చారు. వాటిని ఎరుపు రంగు స్క్రీన్‌లో అస్పష్టంగా ముద్రించారు. ఈ పాఠం చదవను పిల్లలు చాలా కష్ట పడాలి. హిందీ గేయాలకు చిన్న పిల్లల నోరు తిరుగుతుందా లేదా అన్న విషయం ఆ మేధావులకే తెలియాలి. 'ఋ'తో వచ్చే అక్షరమంటూ 'ఋతం' అనే మాట వ్రాశారు. వాడుకలో లేని పదాలు వాడి పసిపిల్లల పై ప్రయోగాలు చేశారు.

గూడూరు -బి. హరీష్

## టౌన్‌బస్సులను దండించే అధికారి లేడా?

టౌన్ బస్సుల అబంధర గూర్చి పత్రికలు విమర్శించినా, ప్రజలు ఏడ్చినా, ప్రమాదాలు రోజూ జరుగుతున్నా కూడా వీటి పై చర్య తీసుకునే అధికారం వున్న అధికారులు పట్టించు కోకుండా వుంటున్నారు. ఇటీవల కొత్తగా వచ్చిన ఆర్టీవో కూడా ప్రైవేట్ బస్సులు సక్రమంగా నడిపే విషయమై ఎన్నెన్నో చేస్తానన్న ఇప్పటికీ ఏదీ చేయలేదు. వారం పది రోజులుగా టౌన్ బస్సుల క్రింద పడి అభాగ్యులు ప్రాణాలు కోల్పోయారు. బస్సులకు టైమంటూ లేదు. కండిషన్‌లో ఏ బస్సులూ లేనట్లు కనిపిస్తుంది. అసభ్యకరమైన టేపు రికార్డులలోని పాటలకు తోడుగా, సిబ్బంది మాటల ధోరణి మరీ శ్రుతి మించి పోతున్నది. పూర్వం రాజులు, మంత్రులు ప్రజల కష్టాలు తెలుసుకొనెందుకు మారు వేషాల్లో సంచరించే వారట. అదే విధంగా జిల్లా కలెక్టర్ ఒకరిద్దరు కొత్త అధికారులను వాస్తవ పరిస్థితుల అధ్యయనానికి పంపించి పరిస్థితులు చక్క దిద్దాలని మనవి.

కలిచేడు -ఎస్. మహబూబ్ బాషా

## జనవాణి

### దయామయుడైన అల్లా భక్తులకు నిర్దయ తగదు !

చరిత్ర తరచి చూస్తే, మతం మానవుడి అభివృద్ధి కంటే అణచి వేతకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చింది. దరిదాపులు అన్ని మతాలు స్త్రీ జాతిని ఘోరాతి ఘోరంగా అణచాయి. వాళ్లను స్వేచ్ఛను దూరంగా బానిసత్వానికి దగ్గరగా వుంచాయి. మత మౌఢ్యానికి, క్రౌర్యానికి నిత్యం బలవుతున్న మన అక్కా, చెల్లెళ్ళ, తల్లుల మొర ఆలకించేందుక్కూడా మనం సహనం అలవరచు కోక పోతే ఎలా? సహనం గల వాడే భగవంతుని సహవాసి - అల్లా పరమ దయామయుడని ఖురాన్ చెబుతుంది. అటువంటి అల్లా భక్తులు ఆడవాళ్ల పట్ల నిర్దయగా వ్యవహరించడం సబబు కాదు. ప్రపంచంలో మారు మూల ప్రాంతాన్నుంచి కూడా జ్ఞానాన్ని ఆర్జించ మని, అమర వీరుడి రక్తం కంటే పండితుడి సిరాయే పవిత్రమని మహమ్మద్ ప్రవక్త స్వయంగా చెప్పి వున్నారు. బంగ్లాదేశ్ రచయిత్రి తస్లీమా నస్రీన్ చేసిన నేరమేమిటి? మత మౌఢ్యానికి పరాకాష్ఠ అయిన హింసను క్రౌర్యాన్ని గర్హించడమేనా? పెరిగిన విజ్ఞానం సహాయంతో మత సిద్ధాంతాలను పునః పరిశీలన చేయమనడం నేరం కానే కాదు. ఒక విషయం యొక్క మంచి చెడ్డల్ని నిర్ణయించేటప్పుడు సత్యదృష్టి మానవతా దృక్పథంతో ఆలోచించాలి గాని ఆవేశాలకు చోటివ్వడం మంచిది కాదు.

గూడూరు -పి.వి. ప్రభాకర రావు

### హాట్సాఫ్ టూ యూ బ్రెజిల్

ప్రపంచ ఫుట్ బాల్ సాకర్ గెలిచి తమ దేశ కీర్తి ప్రతిష్టలు ఇనుమడింప చేసిన బ్రెజిల్ జట్టును అభినందించాలి. 24 సంవత్సరాల తరువాత జట్టు విజయం వెనుక ప్రతి క్రీడాకారుడి అసమాన కృషి వుంది.

కొరవ 6 పేజీలో

## 50 ఏళ్ళ క్రితం ఈవారం

28 -7 - 1944
సం : 6 వెల : 0-1-6

### పల్లెటూళ్లు

#### సర్వేపల్లి వార్తలు

మంచి నీళ్ళ బావికి ప్రక్కన మూడు [illegible] చచ్చి పడి దుర్గంధము కొడుతున్నప్పటికి మా గ్రామాధికార్ల ముక్కులకు పోకలేదే - కలరాలు అమ్మవార్లు ప్రబల మవతాయంటే ఇలాంటి అశుభ్రతల వల్లనే గదా.

* * *

[illegible] పంపకం [illegible] పోస్టు మాస్టరులకు కూడా అలవాటైనవే - ఏమీ లెక్కలు ప్రభో

* * *

చిల్లర వస్తువుల ధరలు యిలాకా కోరకొమ్ముల బర్రె 20 యిబ్బడిగా పెంచి అమ్ముతున్నారు. పై రోజాల నుండి కనబడడం లేదు. వారు కాస్త గమనిస్తే మేలు

-ఒ.వి.

-ఒ.వి.

**జమీన్‌రైతు**

#### వరగడ పశువులు

బాపన తెల్లయెద్దు ఒకటి తక్కువరప్పాడులో పర గడవి వచ్చియున్నవి. స్వంతదార్లు వచ్చి తోలుక పోవచ్చును. అట్లే సర్వేపల్లిలో కూడా ఆవు ఒకటి వున్నది. కుంకెపల్లి

#### పాత విద్యార్థి సంఘ నియోజక వర్గ ఓటర్లకు విజ్ఞప్తి

ఆర్యా!

పాతవిద్యార్థుల తరపున వి.ఆర్. కాలేజి. హై స్కూలు కమిటీకి ఎన్నుకో బడవలసిన 4 స్థానాలకు మేము నలువురము పోటీ జేస్తున్నాము.

ప్రత్యేకంగా తమకు వ్రాసుకునే అవకాశం లేనందున యిందు మూలంగా విజ్ఞప్తి చేస్తున్నందుకు క్షమించి. దయచేసి తమ ఓట్లను మాకొసంగి మమ్ము గెలిపించ వలసినదిగా ప్రార్థన.

భవదీయులు
ఎ.సి. సుబ్బారెడ్డి
వంగల్లు కోదండరామరెడ్డి
నుంకు చంగల్‌రాయశెట్టి
అల్లారెడ్డి శంకర రెడ్డి
యం.ఎ.యల్.యల్.బి.

#### వి.ఆర్. కాలేజి

ప్రిన్సిపాలు: చివరకు తీర్మానమైంది. కాకినాడ పి.ఆర్. కాలేజి ఇంగ్లీషు లెక్చరరున్నూ, ఇద్దరు ధారిన్నీ, వెంకటగిరిలో వారుల భక్తి విశ్వాసాలు చూరగొన్న డాక్టరు లక్ష్మి భర్తయున్నూ, ఆంధ్రా యూనివర్సిటీలోని ఇంగ్లీషు లెక్చరర్లలో అద్వితీయుడు అని సి.ఆర్. రెడ్డిచే పేర్కొనబడిన శ్రీ సచ్చిదానంపిళ్ల గారిని (ఎం.ఎ) ప్రిన్సిపాలుగా నియమించారు. జీతం రూ. 350 - 25 / 1 - 500 లు. వైస్ ప్రిన్సిపాలుగా ప్రస్తుతం ప్రిన్సిపాలుగా వున్న రాఘవన్ గారినే రూ. 250 - 350 గ్రేడులో నియమించారు.

హిస్టరీ: అన్నామలై విశ్వవిద్యాలయంలో పేరు ప్రఖ్యాతలు గన్న, రాజకీయ శాస్త్రం, చరిత్ర పరిశోధకుడైన అలెగ్జాండరు M.A. (M.Litt) గారిని డిపార్టు మెంటల్ హెడ్‌గా నియమించారు. వీరి భార్య కూడా ఎం.ఎ. కాబట్టి ఇంగ్లీషు ట్యూటర్ గా వుండినా వుండవచ్చును.

కొరవ 6 పేజీలో

# నెల్లూరు 'కనుబడుటలేదు'

ఊర్పురేఖలు మైల విరుస్తున్నాయి. మాగన్నుగా నిద్ర. రైలు ఏదో బ్రిడ్జిమీద వెళుతున్న శబ్దం. తటాలున మెలకువొచ్చి కిటికీలోంచి చూసేసరికి. పెన్న! ఇసుక దిబ్బల నడుమ పాయలు పాయలుగా పారుతున్న పెన్న. అటు రంగడి గుడి. వచ్చేసింది నెల్లూరు!.. పదేళ్ల తర్వాత. నా నెల్లూరు!

స్టేషన్‌లో రైలుదిగి ఆ గుహలోంచి బయటకొచ్చే సరికి గయ్‌మంటూ రిక్షావాళ్లు. వద్దు. రిక్షా ఎక్కకూడదు. నడవాలి. నడుస్తూ నెల్లూరిని పలకరించాలి. పలకరించాలి.. నడుస్తున్నాను.. నడుస్తున్నాను.. నెల్లూరు కోసం. నెల్లూరు కోసం నడుస్తున్నాను. ఎంత దూరం .. ఇంకా ఇంకా ఎంత దూరం? ఎంతకీ రాదేం నెల్లూరు? ఎంత వెతికినా కనబడదేం నెల్లూరు? పదేళ్ల తర్వాత వెతుక్కుంటూ వస్తే ఎక్కడికి వెళ్లింది నా నెల్లూరు! ఏమై పోయింది?

నడుస్తూనే వున్నాను.. రోజంతా నడుస్తూనే వున్నాను - నెల్లూరు కనబడుతుందేమోనన్న ఆశతో. కళ్లలో దీపాలు వెలిగించుకొని ఆ పగటి చీకటిలో వెతుకుతూ తిరుగుతున్నాను. ఏదీ ఎక్కడా కనబడదేం! అటు రంగడి గుడి, ఇటు మూలపేటలో శివాలయం దొరికాయి.. మరి కొంచెం దూరం వెడితే నెల్లూరు చెరువు గట్టు కంటపడింది. అంతే మధ్యలో ఐదారు కిలోమీటర్ల నెల్లూరు ఎలా మాయమై పోయింది! అతుకులు గతుకులే అయినా, ఆ విశాలమైన రోడ్లేవి? ట్రంకురోడ్డుకు ఇరువైపులా ఆ చెట్లేవి? టౌన్‌మట్టూ ఆ పచ్చదనం ఏది? టౌన్‌లో కళకళ లెక్కడ? జీవం ఏది? 'నగరజ్యోతి' గోడ వార్తలేవి? తిప్పరాజు వారి సత్రం కాలక్షేపం ఏది! మెట్రోపాలిస్ సెంటర్లో

**ఒక మాజీ**
**నెల్లూరీయుడి**
**అన్వేషణ**

చెట్టు నీడన కబుర్లేవి? టౌన్ హాలు సభలో నాటకాల సందడేది? వి.ఆర్. కాలేజి 'గ్రీన్ వుడ్ ట్రీస్' ఏవి? కస్తూరి దేవి విద్యాలయం కళకళ లెక్కడ? చిన్నబజారు చల్లని పలకరింపు లేవి? రంగనాయకుల పేట రథాల రంగు హంగు లెక్కడ? నవాబు పేట దర్గా ఏది? స్టోన్‌హౌస్ పేట సౌందర్యం ఏమైంది? అక్కడ ఎప్పుడో రెండు వందల సంవత్సరాల క్రిందట స్టోన్‌హౌస్‌దొర తవ్వించిన కోనేరు యింకా వుందా? కడకు 'జమీన్‌రైతు' కు వెడితే అదీ మార్పే!

పదేళ్లలో మనిషి రూపమే మారిపోతుందే, మరి ఊరు మటుకు మారదా? మారుతుంది. మారదను కోవడం, మారకూడదనుకోవడం, పాతకాలపు నెల్లూరే ఎల్లకాలం వుండాలనుకొనడం 'నాస్టాల్జియా' మార్పు మంచిదే. కాని ఇదేం మార్పు! ఇదేం పెరుగుదల! ఉసుర్ల పుట్ట పెరిగినట్టు ఎక్కడి నుంచి వస్తున్నారీ జనం. రోడ్లలో జనం. రైళ్లలో జనం. స్కూళ్లలో జనం. హోటళ్లలో జనం. ఎక్కడ చూసినా కిటకిట లాడుతూ జనం .. జనం! ఈ జన సాగరంలో నెల్లూరు మునిగి పోయింది; కొట్టుక పోయింది ఏ తీరానికో!

నెల్లూరు మారి పోయిందని కాదు నా బాధ. 'మారిపోవురా కాలమూ - మారుట దానికి సహజమురా' అన్నాడొక పాత సినిమా కవి. ఆ కవులు కూడా మారి పోయారను కోండి. అది వేరే విషయం. కలంతో పాటు మారకపోతే స్థాణువులా మిగిలి పోతాం. అటువంటి మార్పు రావాల్సిందే. ఆ మార్పు స్వరూపం వరకే అయితే పర్వా లేదు కానీ, అస్తిత్వమే మారిపోతే.. ! నెల్లూరు అస్తిత్వం మారిపోయింది. సహజ నైజమే మారి పోయింది. వేగం తప్పదు. కానీ ఎంత వేగంలోనైనా 'వ్యక్తిత్వం' చెదర కూడదు. టౌన్ నిండుకూ హోటళ్లు, సినిమా హాళ్లు, నర్సింగ్ హోమ్‌లూ వెలిస్తే వెలిశాయి. బజార్లు బారులు తీరితే తీరాయి. బజార్లు, వాహనాలూ పెరిగితే పెరిగాయి; కానీ ఆ ప్రవాహంలో .. ఆ వెర్రి వ్యామోహంలో నెల్లూరు కనుమరుగై పోయింది.

కొరవ 6 పేజీలో


మద్యనిషేధ జిల్లా ప్రచార కమిటీ సమావేశంలో ప్రసంగిస్తున్న రాష్ట్ర కమిటీ కన్వీనర్ శ్రీ భాట్టం శ్రీరామమూర్తి. జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివరావు, డి.డి.ఒ. వి.ఎన్.విష్ణు.

# భాట్టం సూచన పాటిస్తారా?

నెల్లూరు జిల్లాలో వచ్చే అక్టోబరు నుంచి సంపూర్ణ మద్య నిషేధాన్ని అమలు చేయమని రాష్ట్ర సారా వ్యతిరేక కమిటీ కన్వీనర్ భాట్టం శ్రీరామమూర్తి ప్రభుత్వానికి సూచించారు. జిల్లాలో సారా నిషేధం విజయవంత మయ్యిందని, సంపూర్ణ మద్య నిషేధానికి అనువైన పరిస్థితులు కూడా వున్నాయని చెప్పారాయన. సంపూర్ణ మద్య నిషేధాన్ని దశల వారీగా అమలు జరపాలని ప్రజల అభిమతంగా వుంది; మొదటి మెట్టుగా సారా నిషేధాన్ని అమలు చేశామని, రెండవ మెట్టుగా సంపూర్ణ మద్య నిషేధం ప్రవేశపెడితే బాగుంటుందన్న అభిప్రాయానికి వచ్చారు. మద్య నిషేధం అనేది సామాజిక, ఆర్థిక సంస్కరణ వంటిదని, ఏ ఒక్క సంస్కరణ ఒక్కసారిగా అమలు కాదంటూ, సారా నిషేధం పూర్తిగా విజయవంతం కావడానికి మహిళా చైతన్యమే ప్రధాన కారణమని 22 తేదీ విలేఖరుల సమావేశంలో భాట్టం అభిప్రాయపడ్డారు. మద్య నిషేధాన్ని జాతీయ విధానంగా రూపొందించాలంటూ ఆంధ్రలో సారా నిషేధం సత్ఫలితాలివ్వటంతో ఒరిస్సా, ఢిల్లీ తదితర రాష్ట్రాలలో సారా నిషేధానికి ఆయా ప్రభుత్వాలు సన్నద్ధమవుతున్నట్టు చెప్పారు. దేశంలోని పరిస్థితులంతా చూసి కేంద్ర ప్రభుత్వం కూడా మద్యం దుకాణాల విషయమై అన్ని రాష్ట్రాలకు వర్తించేలా కొన్ని మార్గదర్శక సూత్రాలతో జి.ఓ. కూడా జారీ చేసిందన్నారు. గుడులు, బడులు, జాతీయ రహదారుల ప్రక్కన ''మద్యం. దుకాణాలు'' అనుమతించ రాదని నిర్దేశించినట్లు చెప్పారు. సారా అమ్మకందారులకు నిషేధానంతరం చక్కని ఉపాధి సౌకర్యాలు కల్పించడం సంతోషదాయక మన్నారు. అంతకు ముందుజిల్లా ప్రజా పరిషత్ మీటింగ్ హాలులో జరిగిన సారా నిషేధ ప్రచార కమిటీ సమావేశంలో నిషేధం నాటినుండి ఎనలేని సేవ చేస్తున్న జిల్లా కలెక్టర్ ఎం.సాంబశివరావును దుశ్శాలువతో భాట్టం శ్రీరామమూర్తి సన్మానించారు. కార్యక్రమంలో స్వర్ణా వేమయ్య, డి.డి.ఓ విష్ణు తదితరులు పాల్గొన్నారు.

## నెల్లూరు సంగతులు

### నెల్లూరు లయన్స్ క్లబ్‌కు బెస్టక్లబ్ అవార్డు

నెల్లూరు లయన్స్‌క్లబ్‌కు జోన్ స్థాయిలో బెస్ట్ క్లబ్ అవార్డును ఈ యేడాది గెల్చుకొంది. 93-94 సంవత్సరానికి చేసిన సేవలకు గాను ఉత్తమ లయన్ అధ్యక్షుని అవార్డును ఎస్ఎన్‌వి రామ్మోహన్‌రావు లతో పాటు కార్యదర్శి, కోశాధికారులు కూడా పంచుకొని సన్మానింప బడ్డారు.

# బలిసిన వర్గాల బలహీన సదస్సు!

ఆదివారం వి.ఆర్.సి. గ్రౌండ్‌లో 'గౌడ్ మార్కు' బలహీన వర్గాల సదస్సు జరిగింది. పేరుకు అది బలహీన వర్గాల సదస్సే గాని అక్కడి హంగు ఆర్భాటాలు చూస్తే, ఇటీవల జరిగిన బలమైన సదస్సులను తలదన్ని నట్లనిపించింది. ప్రత్యేక వేదిక రంగురంగుల విద్యుత్ దీపాలు, వెలుగులు చిమ్మిన హాలోజన్ లైట్లతో సభా ప్రాంగణ మంతా పండు వెన్నెల పరచినట్లుండింది. వేదికపై నేతలు 'ఎవరికి వారే యమునా తీరే' ధోరణిలో మాట్లాడి తమలోని ఐక్యత లేదన్న విషయం ప్రజల ముందు చాటారు. రాజ్యసభ సభ్యుడు వి.హనుమంతరావు కాస్తైనాను దుయ్యబట్టేసరికి బహుజనులు 'డౌన్ డౌన్' నినాదా లందుకొన్నారు. సర్దార్ గౌతు లచ్చన్న కనపడిందల్లా జేబులో

**నానా ఖంగాళీగా కలగూరగంపగా గౌడ్ 'షో'**

వేసుకునే వారే కాంగ్రెస్ నేతలని ఆరోపణ చేస్తే, అంకయ్య గౌడ్ తనదైన నాటు భాషలో నేదురుమల్లి, ఆనం కుటుంబీకులను అవహేళన చేశారు. వచ్చిన జనమంతా ఇంటి ముఖం పట్టాక మాట్లాడటం మొదలెట్టిన కేంద్ర మంత్రి వెంకటస్వామి బలహీన వర్గాల సదస్సులోనే బలహీనంగా వున్నామన్న విషయాన్ని తేల్చి చెప్పామని రుసరుసలాడారు. రావుల అంకయ్య గౌడ్, మంకు వెంకటేశ్వర్లు వేదికపైనున్న నేతలను విస్మరించి తమ అనుచరుల చేత పూలదండలు వేయించుకొనే కార్యక్రమంలో మునిగి తేలారు. సభలో మాట్లాడుతుండిన బలహీన వర్గాల నేతలను 'ఇక చాల్లె కూర్చో' అంటూ వేదికపై అటూ ఇటూ తిరుగుతూ కార్యక్రమానికి తానే సూత్రధారిననే 'షో' ప్రదర్శిస్తూ మిగతా నేతలను చిన్న బుచ్చారు అంకయ్య గౌడ్. రాష్ట్ర మంత్రులంతా తరలి వస్తున్నట్లు నిర్వాహకులు ప్రకటించినా ఏ ఒక్క మంత్రి హాజరు కాలేదు. కేంద్ర జౌళిశాఖ మంత్రి జి.వెంకటస్వామి మాత్రం హాజరై కొంతవరకు ఆ లోటు తీర్చారు.

కేంద్ర మంత్రిగారి ప్రసంగం వాడి వేడిగా సాగింది. 47 సంవత్సరాల తర్వాత కళ్లు తెరిచాం. మన బలమేమిటో తెలుసుకొన్నాం ; ఇక మన దగ్గరకే పార్టీలు నాయకులు వచ్చి ఓట్లడగాలన్నారాయన. బలహీన వర్గాల సీట్ల కోసం ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి దయా దాక్షిణ్యాల మీద

కొరవ 8 పేజీలో



# రైతులకు ఎఫ్‌సిఐ మేలు

ఆదివారం జిల్లా పరిషత్ మీటింగ్ హాల్‌లో జిల్లా ఖరీఫ్ పంటల ప్రణాళిక సదస్సును వ్యవసాయశాఖ నిర్వహించింది. అధ్యక్షించిన జిల్లా కలెక్టర్ ఎం.సాంబశివరావు మాట్లాడుతూ 94-95 సంవత్సరానికి ఏడు లక్షల 15 వేల మెట్రిక్ టన్నుల వ్యవసాయోత్పత్తులను పండించాలని ప్రభుత్వం లక్ష్యంగా పెట్టుకొన్నట్లు చెప్పారు. అవసరమైన ప్రత్యేక చర్యలు చేపట్టడం ద్వారా లక్ష్యాన్ని సాధించ గలమంటూ, ఇందుకు అవసరమైన సామగ్రి, సూచనలు, సలహాలు రైతులకు అందజేయమని వ్యవసాయాధికారులను కోరారు. ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా జిల్లా శాఖలో ధాన్యం ప్రొక్యూర్‌మెంట్ 1.65 లక్షల మెట్రిక్ టన్నులకు పెంచుతూ వెల్లడించా రాయన. ఈ ఏడాది అక్టోబర్ నుండి ఇది అమలులోకి వస్తుందన్నారు. గత సంవత్సరం ఎఫ్.సి.ఐ. సేకరణ 80 వేల టన్నులు వుండడం వల్ల రైతులు ధాన్యం అమ్ముకోలేక పడరాని పాట్లు పడిన విషయం అందరికి తెలిసిందే !

### బళ్లారి రాఘవ జయంతి

మహానటుడు బళ్లారి రాఘవ 114వ జయంతి సభ రోడ్ల పద్మావతమ్మ మహిళా గ్రంథాలయంలో ఆగష్టు 2 తేదీ జరుగుతుంది. డాక్టర్ పెళ్లకూరు రవీంద్రరెడ్డి సభను ప్రారంభిస్తారు. ఆర్.పెంచలసింగ్ జ్యోతి ప్రజ్వలించినంతరం, వర్ధమాన సమాజం అధ్యక్షులు పివి రమణారెడ్డి సభను అధ్యక్షిస్తారు. సమాచార, పౌర సంబంధ శాఖ ప్రాంతీయ ఉపసంచాలకులు సిద్దాని నాగభూషణం ముఖ్య అతిథిగా విచ్చేస్తారు. లెక్చరర్ తిరుమూరు సుధాకరరెడ్డి ఉపన్య సిస్తారు. రంగస్థల నటుడు సాయి కిషోర్ 'షొరాబ్ రుస్తుం' పాత్ర పోషించి సన్మానం స్వీకరిస్తారని కళాసుధ సాంస్కృతిక సంస్థ తెలియజేస్తుంది.

# నెల్లూరు లాబీ కబుర్లు

విరూపాక్షుడు

## జనార్దనరెడ్డి సందడి

మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి రెండు రోజులు జిల్లాలో క్షణం తీరిక లేకుండా పర్యటించి వెళ్ళారు. 27 తేది నాయుడుపేటలో 30 పడకల ఆస్పత్రికి, తడలో ఎ.టి.ఐ. భవన సముదాయానికి శంకుస్థాపన చేశారు; సూళ్లూరు పేటలో డిగ్రీ కాలేజి భవనాన్ని ప్రారంభించారు. 28 తేది వెంకటగిరి నియోజక వర్గం డక్కిలిలో పొదుపులక్ష్మి మహిళా సదస్సులో పాల్గొని రాత్రి హైదరాబాద్‌కు వెళ్ళారు. ఈ కార్యక్రమాల్లో జనార్దనరెడ్డితో పాటు మంత్రులు ఆలపాటి ధర్మారావు, పసల పెంచలయ్య శాసన సభ్యులు సి.వి. శేషారెడ్డి, పట్రా ప్రకాశరావు కూడా పాల్గొన్నారు.

నాయుడుపేట ఆస్పత్రికి ఇంతకాలానికి మోక్షం కలగబోతున్నందుకు సంతోషించాలి. 1905 లో కాబోలు నిర్మించిన ఆస్పత్రి భవనం ఏ క్షణాన కూలినెత్తిన పడుతుందోనన్నట్లుంది. డాక్టరుంటే మందులుండవు; మందులుంటే డాక్టరుండడు. ఇన్నాళ్లకు మంత్రి పెంచలయ్య పూనుకొని నాయుడుపేట కొక మంచి ఆస్పత్రి భవనం సమకూర్చి తనవిని సార్థకం చేసుకుంటున్నారు. జనార్దనరెడ్డి రెండు రోజుల సభలు సందడిగానే కాదు, సంబరంగా కూడా జరిగాయి.

## యానాదిరెడ్డికి బైపాస్

దేవాలయాల మంత్రి శ్రీ కలికి యానాదిరెడ్డికి 28వ తేది మద్రాసు అపోలో హాస్పిటల్‌లో గుండె బైపాస్ సర్జరీ జరిగింది. క్షేమంగా వున్నారు.

## పద్మశ్రీ ఫిర్యాదు

పార్లమెంట్ సభ్యురాలు కుమారి పద్మశ్రీ పొదలకూరు నాటు రాజకీయ వేత్త రావుల అంకయ్య గౌడ్ మీద ఫిర్యాదు చేస్తూ ఒక ఉత్తరం రాసింది. అంకయ్యగౌడ్ తనను గురించి ప్రతి సభలోనూ అసభ్యంగా, అతినీచంగా మాట్లాడుతున్నారని ఆమె ఆ లేఖలో పేర్కొన్నది. సభల్లో శ్రీవారి బూతుపంచాంగం వినలేని స్త్రీలు తనవద్దకు వచ్చి ఎంతో బాధతో ఆ విషయం చెప్తున్నారని ఆమె రాసింది. విద్యావంతురాలు, పార్లమెంట్ సభ్యురాలు, పెళ్లికాని యువతి అయిన తనను అంకయ్య గౌడ్ దాడి నుంచి కాపాడవలసిందిగా ఆమె ప్రధానిని కోరింది.

అంకయ్యగౌడ్ మాతృభాష అది. ఆ భాషలోకాక మరో భాషలో ఆయన మాట్లాడలేరు పాపం!

## 'బెజవాడ' శతజయంతి

ఒకనాటి రాజకీయ వేత్త, జస్టిస్‌పార్టీ పట్టుకొమ్మ, రైతు పెద్ద బెజవాడ రామచంద్రారెడ్డి శతజయంతి ఉత్సవాన్ని ఘనంగా జరపడానికి మాజీ ఎంఎల్ఏ శ్రీ ధనెంకుల నరసింహం పూనుకున్నారు. కార్యనిర్వాహక సంఘం ఏర్పడింది; సన్నాహాలు జరుగుతున్నాయి. రాజకీయాభిప్రాయలతో విభేదించినా నెల్లూరీయులు సంస్మరించుకొనవలసిన ప్రముఖుడు బెజవాడ రామచంద్రారెడ్డి. ఆయన శత జయంతి ఉదాత్తంగా జరగడమే కాక, ఆయన స్మృతి చిహ్నం కూడా నెల్లూరు[illegible] నెలకొల్పితే బాగుంటుంది.

## పెళ్లకూరుకు సన్మానం

కొందరు సన్మానాలందుకోడానికే పుట్టారా అనిపిస్తారు. ఇఫ్కో ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు రామచంద్రారెడ్డి కూడా అట్లాంటి అదృష్టవంతుడు. ఆయన సేవల్ని ప్రస్తుతిస్తూ నెల్లూరు రోటరీ వారు 28 తేది సర్వోదయా కాలేజి ప్రాంగణంలో ఘనంగా సన్మానించారు. ఇఫ్కో తరపున సేవాసంస్థలకు ఐదు లక్షల దాకా విరాళం యిచ్చే అవకాశం వుందని, దీన్ని 15 లక్షలకు పెంచడానికి ప్రయత్నిస్తానని శ్రీ రామచంద్రారెడ్డి చెప్పారు. ఇఫ్కో తరపున దర్గామిట్టలోని అంధుల పాఠశాలకు 50 వేలు యివ్వగా, జిల్లా కలెక్టర్‌కు యిచ్చిన 75 వేలు మాచింగ్ గ్రాంట్‌తో ఒక భవనం నిర్మించారని, వికలాంగుల శస్త్ర చికిత్సకు 50వేలు యిచ్చామని ఆయన తెలియజేశారు.

రామచంద్రారెడ్డిగారూ! ఇఫ్కో తరఫున వేలు కాదు, లక్షలు యివ్వాలి ఇట్లాంటి మంచి పనులకు, మంచి సంస్థలకు!

# 'కృష్ణపట్నం' పెను తుఫాను అవుతుందా?

కృష్ణపట్నం థర్మల్ విద్యుత్ [illegible] ప్రాజెక్టు వ్యవహారం చిలికి చిలికి గాలివానతో ఆగకుండా పెను తుఫానుగా వీచే ప్రమాదం వుంది. ముఖ్యమంత్రి ముచ్చటపడి 'చంద్రునికో నూలు పోగ' న్నట్లు ఈ 'కోట్ల' ప్రాజెక్టును తన అల్లుడికో కానుకగా యివ్వదలిస్తే అడుగడుగునా అవరోధాలే. అభాండాలే ఎదురవుతున్నాయి. వెయ్యి మెగావాట్ల కాంట్రాక్టును చెరిసగం చేసి ఒక సగాన్ని తన అల్లుడు వ్యాపార ప్రతినిధిగా లావాదేవీలు సాగిస్తున్న అమెరికన్ కంపెనీకి, మరోసగం చీఫ్ సెక్రెటరీ జయభారతరెడ్డి దగ్గర బంధుత్వంతో కాంట్రాక్టు సంపాదించుకొన్నదని చెప్పబడుతున్న జివికె ఇండస్ట్రీస్‌కి ఇవ్వాలని ముఖ్యమంత్రి ఆశించి, మంత్రివర్గ సమావేశంలో ఎదురైన వ్యతిరేకతను, విమర్శలను, సలహాలను సైతం పెడచెవిని పెట్టి కార్యం సాధించుకొన్నారు. ఐతే ఇల్లు అలకగానే పండగకాలేదు. అవకాశం కోసం పొంచివున్న 'తెలుగుదేశం' ముఖ్యమంత్రి మీద ధ్వజ మెత్తడంతో సరిపెట్టుకోక, గాలి ముద్దుకృష్ణమనాయుడు చేత హైకోర్టులో రిట్ కూడా వేయించింది. కోర్టుకు వెళ్లడమంటూ జరిగితే ప్రభుత్వ ఉత్తరువు గాలికి కొట్టుక పోతుందని మొదట్నుంచి హితులు పలుకుతున్న 'అపశకునమే' వరకు నిజ మయ్యేట్లుంది.

కోర్టులో ప్రభుత్వానికి ఖాయంగా అపజయం ఎదురవుతున్న వాదనకు ఆధారాలు లేక పోలేదు. వెయ్యి మెగావాట్ల ప్రాజెక్టును ఒక్క కంపెనీ చెయ్యలేదు గనుక రెండుగా చీల్చాల్సి వచ్చిందని ప్రభుత్వం చెబుతున్న కారణం నిజమే అయితే, ఆ పని ఏడాది క్రితం అంతర్జాతీయ స్థాయిలో టెండర్లు పిలిచినప్పుడు ఎందుకు చెయ్యలేదు అన్న ప్రశ్న ఎదురవుతుంది. అమెరికన్ కంపెనీ కంటే పెద్ద కంపెనీలు టెండర్లు వేసినా, వాట్ని కాదని ఆ కంపెనీకే ఎందుకు కాంట్రాక్టు యిచ్చినట్లు? పైగా టెండర్లలో అపోలో - హాస్పిటల్స్‌కు 253 పాయింట్లు వుండగా, దాన్ని అధిగమించేందుకు ఆ అమెరికన్ కంపెనీకి అదనంగా దొంగ పాయింట్లు కలిపి పైకి తెచ్చారన్న లోగుట్టు కూడా బయటికి పొక్కింది. అసలు అమెరికన్ కంపెనీ పేరుగొప్ప ఊరుదిబ్బ అన్నట్లుందట. ఐదువందల మెగావాట్ల ప్రాజెక్టును చేపట్ట గలిగిన ఆర్థిక స్తోమతగానీ, శక్తి సామర్థ్యాలు గానీ దానికి లేవని, అది అమెరికాలో ఇంతదాకా చెప్పుకో దగిన ప్రాజెక్టులేవీ చేసిన దాఖలాలు లేవని, పైగా అక్కడ అవి కోర్టు వ్యవహారాల్లో చిక్కుకొని ఇబ్బందులు పడుతున్నదని కూడా వెల్లడయింది. టెండరు లోపాయికారీ వ్యవహారాలు బయట పడినందుకు కాబోలు సాధారణ పరిపాలనాశాఖ తప్పుటి సెక్రెటరి రంగారెడ్డిని బదలీ చేశారని సెక్రెటేరియట్‌లో గుసగుసలు వినవస్తున్నాయి.

మొత్తం మీద ముఖ్యమంత్రి ఇంత కాలంగా కూడబెట్టు కొంటున్నాననుకున్న 'మిస్టర్‌క్లీన్' ప్రతిష్ఠకు కృష్ణపట్నం పెద్ద గండి కొట్టింది. దీన్ని తెలుగు దేశం తమ్ముళ్లు ఒక ఎలక్షన్ నినాదంగా, వివాదంగా జనం ముందుకు తీసుకెళ్తే మనగతేమిటి మహాప్రభో అని కాంగ్రెస్ శాసన సభ్యులు తలలు పట్టుకొంటున్నారంటే ఆశ్చర్యమేముంది.

### ఈ ప్రశ్నకు బదులేది

మొదటి పేజీ తరువ

2. సాధారణంగా ఒక ఎన్జీవో వేతన స్కేలుకు సంబంధించిన (విజవిజయవాడ సిద్ధార్థ మెడికల్ కాలేజిలో అసిస్టెంట్ లైబ్రేరియన్) నిర్ణయాన్ని కూడా మంత్రి మండలి తీసుకున్నప్పుడు, సుమారు నాలుగు వేల కోట్ల రూపాయలు విలువ చేసే కృష్ణపట్నం థర్మల్ కేంద్రం, రెండు కోట్ల విలువ చేసే రామగుండం థర్మల్ కేంద్రాల ఏర్పాటు నిర్ణయాన్ని మంత్రి మండలి ముందు పెట్టకుండా లోపాయి కారిగా ఆమోదించాల్సిన అవసర మేమిటి? మంత్రి మండలి సమావేశం వారం రోజు లుండగా హడావుడిగా ఇంత పెద్ద కీలక నిర్ణయాల్ని తీసుకోవడంలో ఔచిత్యం వుందా?

3. కృష్ణపట్నం కేంద్రాన్ని రెండు భాగాలు చేయడం వల్ల ఓడరేవు నిర్మాణం భవితవ్యం ఏమిటి? ఓడరేవు లేకుండా థర్మల్ కేంద్రానికి, బొగ్గు ఎలా చేరవేస్తారు? అది సాధ్యమయ్యే పనేనా? ఒకవేళ రెండు కంపెనీలు కలిసి ఓడరేవు నిర్మించుకున్నా ఉపయోగించుకునే విషయంలో పేచీలు తలెత్తవా?

4. అపకతవకలతో, హడావుడిగా ఆమోదించిన టెండర్లను ఎవరైనా కోర్టులో ప్రశ్నిస్తే, జరిగే జాప్యానికి ఎవరు బాధ్యులు?

## టౌన్ బస్సుల అరాచకం

టౌన్‌బస్సుల ఆగడాలు మితిమీరి, అదుపు తప్పి అరాచకానికి చేరుకున్నా అరికట్టే దిక్కులేక పోవడం నెల్లూరు దౌర్భాగ్యం. 25 వతేది ఉదయం దర్గామిట్టలోని అంబుజావర్క్ షాపు వద్ద 23 నెంబరు టౌన్‌బస్సు ఒక పసిపిల్లవాడి పచ్చి నెత్తురు తాగింది. సి.వి.రామన్ హైస్కూల్లో ఎనిమిదోతరగతి చదువుతున్న గార్లపాటి కళ్యాణ్(14) సైకిల్లో స్కూలుకు వెళ్తుండగా, వెనకనే దురుసుగా వచ్చిన టౌన్ బస్సు ఆ అబ్బాయినికొట్టేసింది. ముందు వెళ్తున్న ఆర్టీసి బస్సును ఓవర్ టేక్ చేసే తొందరలో ఆ పసివాణ్ణి బలితీసుకొంది ఆ కిరాతక వాహనం! బస్సుకింద నలిగి పోయిన ఆ పసివాణ్ణి చూసి కంట తడి పెట్టని వారు లేరు. కొందరు పట్టరాని కోపంతో బస్సుమీద దాడి చేసి, డ్రైవర్, కండక్టర్లకు దేహశుద్ధి కూడా చేశారు. అక్కడికి ఆవేశం చల్లారని కొందరు ఆ టౌన్ బస్సుల అద్దాలు పగుల గొట్టారు.

ప్రజల కోపానికి అర్థంవుంది. టౌన్ బస్సుల మీద ఆకోపం ప్రదర్శించాల్సిందే! వాటిపైవర

కొరవ 6 పేజీలో

## ఆర్వీ
2 పేజీ కొరవ

అనరాని మాటలేమీ అనలేదు. చేయరాని వ్యాఖ్యలేమీ చెయ్యలేదు. రాజీవ్ ఏ సమస్యనైనా చైతన్యవంతంగా ఎదుర్కొనగలడు. కానీ పార్లమెంటరీ అనుభవం కొరవడడం వల్ల కొంతవరకు ఇబ్బందుల్లో పడ్డారు అని ఆ ఇంటర్వ్యూలో ఆర్వీ అన్నారు. అదైనా ఎందుకనాల్సి వచ్చిందంటే, బోఫోర్స్ వ్యవహారంలో రాజీవ్ వైఫల్యానికి కారణం ఆయన అనుభవ రాహిత్యమేనని చెప్పడానికి ! ఇక్కడ బోఫోర్స్ కుంభకోణాన్ని ఎదుర్కోవడంలో మాత్రమే రాజీవ్ విఫల మయ్యారన్న ధ్వని వుండడాన్ని గమనించాలి. ఐతే అనుభవ రాహిత్యమే రాజీవ్ లోపమా అన్న ప్రశ్నకు ఆర్వీ ఐదమిత్థంగా చెప్పలేనంటూ, రాజీవ్ గొప్ప ప్రతిభ కనబర్చారని ప్రశంసించాడు. అందుకు ఉదాహరణగా శ్రీలంక ఒప్పందాన్ని పేర్కొన్నాడు. మొత్తంమీద పార్లమెంటులో చాకచక్యంగా వ్యవహరించ లేకపోవడం ఒక్కటే రాజీవ్ లోపంగా ఆర్వీ అభిప్రాయ పడ్డారు. "జీవితం హేతుబద్ధం కాదన్న నిజాన్ని గుర్తించేంతటి అనుభవం రాజీవ్‌కు లేకపోయింది. ఏ భౌతికశాస్త్రంలోనో, రసాయన శాస్త్రంలోనో ప్రయోగాలు చేస్తే ఖచ్చితమైన ఫలితాలు వచ్చినట్టు అన్నిట్లోనూ వస్తాయని రాజీవ్ అనుకొనేవాడు" - ఇదీ ఆర్వీ వ్యాఖ్య. ఇందులో రాజీవ్ భక్తులు గుండెలు బాదుకొని, జుట్టు పీక్కోవలసినంత తప్పు ఏముందో వాళ్లకే తెలియాలి. రాజీవ్‌కు ఆర్వీ అన్యాయం చేశాడనడంతో సరిపెట్టుకోవడం లేదు ; ఉన్నత పదవి యిచ్చి గౌరవించినందుకు ఇదా ఆయన చూపాల్సిన కృతజ్ఞత అని దుమ్మెత్తి పోస్తున్నారు.

ఇది విపరీత ధోరణి. ఆర్వీకి రాష్ట్రపతి పదవి ఇచ్చింది రాజీవా, లేక అనాటి రాజకీయ పరిస్థితులా అనేది అటుంచి. ఈ నాయకులు మంత్రులైనట్టే ఆర్వీ కూడా 'రాజీవ్ కృప' తోనే రాష్ట్రపతి అయ్యారనుకొందాం. అంత మాత్రాన ఆయన తన అభిప్రాయాలు ప్రకటించుకోకూడదనడం ఏం ప్రజాస్వామ్యం ? ఇదేనా వీళ్లు గౌరవించే భావప్రకటన స్వేచ్ఛ! ఇదేనా రాజ్యాంగంలో పేర్కొన్న ప్రాథమిక హక్కులను కాపాడడం ! మాజీ రాష్ట్రపతి కలానికే సంకెళ్లు వెయ్యాలనే ఈ నాయకమ్మన్యులు పత్రికా స్వేచ్ఛను ఇంకెన్ని విధాలుగా గొంతు పిసుకుతున్నారో ఊహించుకోగలం! వెంకట్రామన్ మీద నిప్పులు కక్కడంతో సరిపెట్టుకోలేదు. పుస్తకాన్నే నిషేధించాలని కూడా ఉగ్రరూపాన్ని ప్రదర్శించారు. ఇదీ ఈ కాంగ్రెస్ నేతలు భావ ప్రకటనా స్వాతంత్ర్యానికి ఇచ్చే గౌరవం ! పుస్తకం ఎంత వివాదాస్పదమైనా కావచ్చు. ఎంత అప్రియాలనైనా చెప్పి వుండవచ్చు. ఒక్కోసారి ఊహించని పరిణామాలకు దారితీయనూవచ్చు. అంత మాత్రాన్నే పుస్తకాన్ని నిషేధించాలనడం ఏం ప్రజాస్వామ్యం! పుస్తకాల మీద కన్నెర్ర చేసే ఈ నాయకులా రాజ్యాంగాన్ని, భావస్వాతంత్ర్యాన్ని పరిరక్షించే పాలకులు ! అమెరికాలో నిక్సన్ తన అనుభవాలను పుస్తక రూపంలో వెలువరించాడు. అదీ వివాదాస్పదమైందే. కానీ దానిమీద చర్చలు జరిగాయి కానీ, ఎవరూ దాన్ని నిషేధించమని ధ్వజమెత్తలేదు. మన నేతలకు ఆపాటి సహనం, నిగ్రహం ఎక్కడివి ?

ఇందులో మరో వివాదం కూడా తలెత్తింది. ఆర్వీ రాష్ట్రపతి పదవిలో వుండగా జరిగిన వ్యవహారాలను బయట పెట్టడం పదవీ స్వీకార సమయంలో చేసిన ప్రమాణాన్ని భగ్నపరచడమే కదా అని కొందరు విమర్శిస్తున్నారు. కానీ ఆర్వీ తన పుస్తకంలో అనాటి ప్రభుత్వానికి సంబంధించిన ఏ రహస్యాన్నీ బయట పెట్టలేదు. ప్రభుత్వేతర విషయాల్నే ఆయన ప్రస్తావించాడు. అందువల్ల అవి రాజ్యాంగ పరిధిలోకి రావు. ఐతే రాష్ట్రపతి పదవి నుంచి విరమించుకొన్న రెండేళ్లలోనే ఇట్లా అనేకానేక విషయాలను ముగ్గులోకి తీసుకరావడం గలభా. దీనివల్ల రాజకీయాల్లో వున్న వాళ్లకు ఇబ్బంది కదా అంటే, అది వేరే విషయం!

ఇంతకీ రాజీవ్ భక్తులు ఆర్వీని రచ్చకీడ్చి తగువు పెట్టుకోవడం ఎందుకనే ప్రశ్న మిగిలే వుంది ! కాంగ్రెస్‌లో రాజీవ్ విధేయులకు, ఇతరులకు నిరంతరం మునుగులో గుద్దులాట సాగుతూనే వున్నా, దానికి ఇదొక గుర్తుగా అర్థం చేసుకొన్నా తప్పు కాదు. దాంతోపాటు ప్రజల్లో రాజీవ్ సానుభూతిని మరోసారి లేవదీసి లాభ పడడానికి ఇదొక గొప్ప అవకాశంగా వారు భావించి వుండాలి. అంతకు మించి ఈ దుమారానికి అర్థమేమైనా వుందా ?





## 50 ఏళ్ళ క్రితం
3 పేజీ కొరవ

ఎకనామిక్స్: పి. చంద్రశేఖర రెడ్డి M.A. L.L.B. గారు యూనివర్శిటీలో ఎకనామిక్స్‌లో ఫస్టు 'విలియమ్స్ మెమోరియల్ గోల్డు మెడలు' న్నూ 'రామేశ్వర్' గుర్తు మెమోరియల్ గోల్డు మెడలున్నూ యూనివర్శిటీలో పొందిన వారు. వీరు ఎకనామిక్స్ డిపార్టు మెంటల్ హెడ్‌గా వుందురు.

ఇంగ్లీషు: గుర్రం సుబ్బరామయ్య ఎం.ఏ., గారిని గూర్చి మీకు తెలిసిందే. వీరిని ఇంగ్లీషు డిపార్టు మెంటల్ హెడ్‌గా నియమించారు.

లెక్కలు: టి.ఆర్. వెంకట కృష్ణయ్యర్ ఎం.ఏ. (3rd Class) గారిని వైస్ ప్రిన్సిపాల్ నుంచి, లెక్కలు డిపార్టు మెంటల్ హెడ్‌గా నియమించారు.

ఫిజిక్సు: పి.ఎం. మోసెస్ ఎం.ఏ. గారిని ఫిజిక్సు హెడ్‌గా నియమించారు. బహుశా సైన్సుకూ వీరే వుంటారేమో? వీరిని గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదుయూనివర్శిటీలో ఫస్టున పాసయ్యాడు.

తెలుగు: సంతత ఖద్దరు ధారిన్నీ, గ్రంధకర్త యున్ను అయిన శ్రీ దుర్భా వెంకట కృష్ణమూర్తి M.A. గారిని తెలుగు డిపార్ట్ మెంటల్ హెడ్‌గా నియమించారు. వీరు మదనపల్లి కాలేజి నుంచి వచ్చారు.

అసిస్టెంటు లెక్చరర్లు: కె. జగన్మోహన రావు M.A. ఫస్టు క్లాసు గారు మేథమేటిక్స్ లెక్చరరు. యూనివర్శిటీలో మంచి 'ర్యాంకు' సంపాదించిన వ్యక్తి. సిమ్లా కొండల నుంచి వస్తున్నాడు. సాంబశివ రావు M.A. ఫస్టు క్లాసు గారిని జూనియర్ లెక్చరరుగా నియమించారు.

సుబ్బిరెడ్డి M.Sc. గారిని ఫిజిక్సు జూనియర్ లెక్చరర్‌గా నియమించారు. వీరు కాకినాడ నుంచి వస్తున్నారు.

కె.వి. కృష్ణ M.Sc. ఫస్టు క్లాసు గారిని డిమాన్ స్ట్రేటర్‌గా నియమించారు. భీమసేన రావుకు చెల్లు చీటి యిచ్చారన్న మాట.

టి.వి. సుబ్బారావు నాయుడు (M.Sc., సెకండ్ క్లాస్ ఆగ్రా) గారిని బాటనీ (అగ్రికల్చరల్ కాదు) డిమాన్ స్ట్రేటర్‌గా నియమించారు. మంచి బోధనా శక్తి గల వ్యక్తి.

తెలుగు: వెంకటగిరి జగన్నాథ శాస్త్రి గారి సోదరుడు విశ్వేశ్వర శాస్త్రి గారిని తెలుగు పండిట్‌గా నియమించారు.

చివరకు ఇది ఒక సామాన్య కాలేజి గాక, మంచి కాలేజి అనిపించి నందుకు కమిటీ వారికి మా ధన్యవాదాలు.

## అనుబంధం
2 పేజీ కొరవ

నెల్లూరు మట్టికొక వాసన వుంది. నెల్లూరు చెట్టుకొక ఊపువుంది. నెల్లూరు మలుపుకొక అందం వుంది. నెల్లూరు గాలికొక తాకిడి వుంది. అవి పోతే అది నెల్లూరు కాదు. పదేళ్ల తర్వాత నెల్లూరులో అడుగు పెట్టిన నాకు టౌన్ బాగానే వుంది. మనుషుల ప్రాణాలు నిట్ట నిలువునా హరిస్తేనేం, టౌన్ బస్సులు సౌకర్యంగానే వున్నాయి. రోడ్డు దాటడం కనాకష్టమై పోతేనేం, కార్లు, స్కూటర్లు, రిక్షాలు, ఆటోలు ఆటోపంగానే తిరుగుతున్నాయి. వీధులు మరీ బిజీగా, గజిబిజీగా వుంటేనేం. వ్యాపారం సజావుగా సాగుతున్న సూచనలున్నాయి. పెంట దిబ్బలు అడుగడుగునా పేరిపోతేనేం, నాగరికత వెల్లివిరుస్తున్న గుర్తులున్నాయి. ఇంత కంటే పదేళ్ల కిందట ఈ మహా పట్టణం ఏమంత పరిశుభ్రంగా లేని మాట నిజమే; కానీ అది నెల్లూరు. అప్పుడు "నెల్లూరు వాసన" వుండేది. ఇప్పుడిది నెల్లూరేనా? నా నెల్లూరేనా?

-మాజీ నెల్లూరీయుడు

## జిల్లావార్తలు
5 పేజీ కొరవ

డి.ఇ.ఓ.గారు ఒకసారి ఆ స్కూల్ సందర్శించి పరిస్థితులు చక్కదిద్దితే ఆ గ్రామస్తులు పది కాలాల పాటు తమరి పేరు చెప్పు కొంటారు.

## జనవాణి
3 పేజీ కొరవ

ముఖ్యంగా జట్టులోని ఆటగాడు రోమారియో ఆటను గూర్చి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. కష్టే ఫలి అన్న సామెత బ్రెజిల్‌కు తప్పక అనువర్తిస్తుంది. భారత ఫుట్‌బాల్ జట్టు అంతర్జాతీయ స్థాయికి ఎప్పుడు ఎదుగుతుందో? బ్రెజిల్ కప్పు ఎప్పుడు సాధిస్తుందో?

సి.వి. రమణకుమార్

నెల్లూరు

## బలహీన వర్గాలంటూ పవర్ కొరకెందుకీ ఆరాటం!

నెల్లూరులో మొన్న జరిగిన బల(మైన) హీన వర్గాల వారి సదస్సుకు వెళ్తే - అక్కడ ఇంచు మించు రెండే రెండు కులాల వారి బల ప్రదర్శన కనబడింది. కులాలు పోవాలి - మతాలు సమసి పోవాలి అనే అభ్యుదయ భావాలు కల నా బోటి వారికి ఎంతో మనస్తాపాన్ని కలుగజేసింది. డిగ్రీలు చదువుకున్న వారందరికీ ఒకే స్థాయి వుద్యోగం దొరుకుతుందా? ఒకరు గుమాస్తా ఒకరు ఆఫీసరు. ఒక వ్యాపారం చేసిన ఇద్దరిలో ఒకరికి అనూహ్యమైన ఆదాయం, ఇంకొకరికి చేతికి చిప్ప. ఎవరికి ఎందులో ప్రావీణ్యం వుంటే వారికి అందులో తగిన స్థానం లభిస్తుంది. అంతే గాని కుల ప్రాతిపదిక పై, మంది ప్రాతిపదిక పై రాజకీయ లబ్ధి కావాలనడం - ఎవరో చేతిలో పెట్టలేదనడం ఎంత వరకు సబబు. అదే సభలో పై స్థానంలో అంటే స్టేజినెక్కిన వారి నందరికీ గమనించండి. ఎవ్వరూ ఆర్థికంగా వెనుక బడిలేరు - రాజకీయంగా వెనుక బడి లేరు అయినా ఎందుకు రెచ్చ గొడుతున్నారో? ప్రజలారా వారి ఆరాటాన్ని మీ భుజాల కెత్తుకో కండి. అది మీకే నష్టం.

నెల్లూరు -ఎమ్. అలీ

## నెల్లూరు ముచ్చట్లు
[illegible] పేజీ కొరవ

విషారం చూస్తుంటే ఎవరికైనా ఆగ్రహం కలగడం సహజం. రోడ్డు మీద జనం వుంటారన్న ధ్యాసం బొత్తిగా లేని మోటు [illegible] నడిపితే, అవి మృత్యు వాహనాలు కాక ప్రజావాహనాలెట్లా అవుతాయి? ఎన్ని ప్రాణాలను హరించాయో, ఇంకెంత మందిని పొట్టన బెట్టుకోబోతున్నాయో- ఈ టౌన్ బస్సుల మృత్యు వాత నుండి నెల్లూరుకు విముక్తి కలిగించే దిక్కులేదా? ఇంత ప్రభుత్వ యంత్రాంగం వుంది. ఇంత పోలీసు సిబ్బంది వుంది. ఇంత ప్రజాభిప్రాయం వుంది- ఐనా ఈ పనికిమాలిన టౌన్ బస్సులను అదుపు చెయ్యలేక పోతున్నారంటే ఏమనుకోవాలి? అమాయకంగా పుస్తకాలు భుజాన వేసుకొని బడికి వెళ్తున్న పసివాడి పచ్చి నెత్తురు తాగిన ఆ టౌన్ బస్సు అద్దాలు పగుల గొట్టడం కాదు. అక్కడికక్కడే తగుల బెట్టినా తప్పుకాదు. ఇట్లాంటి ప్రమాదాలకు కారకులైన వాళ్లను ఉరికే శిక్షించడం కాదు. ఆ జన్మాంతం గుర్తుండే విధంగా శిక్షించాలి.

## డోలేంద్ర అమెరికాకు...

జమీన్‌రైతు సంపాదకుడు నెల్లూరు డోలేంద్ర ప్రసాద్ 22వ తేది అమెరికా వెళ్లాడు. జమీన్‌రైతు పని మీద కాదు లెండి; రొయ్యల పరిశ్రమ అభివృద్ధికి ప్రవాస భారతీయుల సహకారం పొందడానికి - వారి పిలుపు మీదనే వెళ్లాడు. రెండు వారాల పర్యటన.

## డాక్టరేట్

మైపాడు స్టాండర్డ్ హేచరీస్ జనరల్ మేనేజరు శ్రీమతి పి. జయప్రద జంతుశాస్త్ర పరిశోధనలో శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ డాక్టరేట్ పొందారు. సముద్ర తీరప్రాంతంలోని రొయ్యలపై రైతులు వాడుతున్న క్రిమిసంహారక మందుల ప్రభావంపై ఆమె పరిశోధన చేశారు. కోవూరుకు చెందిన జయప్రద కావలి పి.జి. సెంటర్‌లో ఎంఎస్‌సి చేసి, 1988లో యూనివర్శిటీ ఫస్టుగా వచ్చారు. ఆమె భర్త డాక్టర్ ఏ. రవీంద్ర కుమార్ రెడ్డి పిహెచ్‌డిలో బంగారు పతకం పొంది, నెల్లూరు మత్స్యకళాశాలలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు.

## వేమన జయంతి

వర్తమాన సమాజాధ్వర్యంలో 31తేది టౌన్‌హాల్లో వేమన జయంతి జరుగుతుంది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షిస్తారు. డాక్టర్ రావిభారతి వేమన మానవీయ దృక్పథంపై ప్రసంగించి, స్వర్గీయ గునుపాటి యానాదిరెడ్డి స్మృత్యంకంగా శ్రీ గునుపాటి ఆదిశేషారెడ్డి సన్మానం స్వీకరిస్తారు.

# స్మగ్లర్ల కొత్త ఎత్తు- అధికారులు చిత్తు చిత్తు!

రాపూరు నుంచి ఎర్ర చందనాన్ని స్మగ్లింగ్ చేస్తున్న వ్యక్తులు అనుసరిస్తున్న ఎత్తులకు అటవీ శాఖాధి కారులు చిత్తయి పోతున్నారు. దీనివల్ల లక్షలాది రూపాయలు విలువ చేసే ఎర్రచందనం అడ్డూ అపూ లేకుండా యథేచ్ఛగా రాపూరును దాటి వెళ్లి పోతుంది. స్మగ్లర్లు ముందుగా ఫలాన మార్గంలో చందనం రవాణా అవుతుందని అధికారులు ఫోన్‌లో సమాచార మందించి తప్పు త్రోవ పట్టిస్తున్నారు. అటవీ శాఖాధి కారులు హడావుడి ఆ మార్గాన చేరి సోదా మొదలెట్టి, ముగించి వచ్చేసరికి తెలివిగా మరో మార్గంలో తమ వాహనాలను తీసుకెళ్లి పోతున్నారు. ఇటీవల చిట్వేల్ రాపూరు ఘాట్ రోడ్డులో లారీ క్రింద భాగంలో చందనం దుంగలు వేసుకొని పైన అరటి కాయల లోడుతో దర్జాగా స్మగ్లర్లు సాగి పోయారట. పగటి పూట స్మగ్లర్లు లారీనంతా ఎరువుతో నింపి క్రింద చందనం దుంగలు పెట్టి జల్సాగా వెళ్లి పోతున్నారు. ఫారెస్ట్ అధికారుల్లో కొంత మందికి ఈ పద్ధతులు తెలిసినా ముడుతున్న మామూళ్ల వల్ల ముడుచుకొని కూర్చుంటున్నారన్న విమర్శ వినవస్తుంది. అందువల్లే స్మగ్లింగ్ నిరోధానికి దోహదపడే ఘాట్ రోడ్‌లో చెక్ పోస్టుకు ఎటువంటి ప్రయత్నాలు చేయడం లేదని తెలుస్తుంది!

## జిల్లా వార్తలు

### నాయుడుపేటకు బస్సు సౌకర్యం కల్పించండి!

నాయుడు గ్రామానికి బస్సు సౌకర్యం లేక పోవడం వల్ల గ్రామస్తులు పడరాని పాట్లు పడుతున్నారు. గ్రామానికి పోవాలంటే జిల్లా కేంద్రం నుండి డైరక్టుగా బస్సు సౌకర్యం లేదు. మధ్య, మధ్య దిగి వేరే బస్సులు మారాలి. నాయుడుకు మంచి రోడ్డు వుంది; కావాల్సినంత మంది గ్రామస్తులు ఆర్టీసీ బస్సు పైనా, క్రిందా ఎక్కుతారు. కాని ఆర్టీసీ అధికారులకు నాయుడు ప్రజల పై దయకల్గలేదు.

### గూడూరు మర్చంట్స్ అసోసియేషన్

ది గూడూరు మర్చంట్స్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశం 18 తేదీ వాసవి కళ్యాణ సదనంలో వి. రమణా రెడ్డి అధ్యక్షతన జరిగింది. ఈ సందర్భంగా నూతన కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. అధ్యక్షులుగా పివి ప్రభాకర రావు, ఉపాధ్యక్షులుగా పుచ్చా రాధాకృష్ణ మూర్తి, కార్యదర్శిగా సోమిశెట్టి గోవింద రావు, సంయుక్త కార్యదర్శిగా కె. వెంకట సుబ్రహ్మణ్యం కోశాధికారిగా కొండా మునిరత్నాలను ఎన్నికయ్యారు. సలహా మండలిలో పి. రమణా రెడ్డి, కె. శ్రీనివాస రావు, జీ. బాలయ్య, జీ. వెంకట సుబ్బయ్య, వి. వెంకట సుబ్బయ్య, జీ. రత్నయ్య వున్నారు. ఈ అసోసియేషన్‌ను 1965లో పేకేటి వెంకట రమణయ్య స్థాపించారు.

# నేత్రదానంలో గూడూరు ఘనం

గూడూరు నేత్రదాతల సంస్థ పుట్టి 7 మాసాలే అయినా ఇప్పటి వరకు 24 జతల కళ్లను స్వీకరించి రికార్డు సృష్టించింది. స్వచ్ఛంద నేత్ర దాత సంస్థగా గూడూరు సంస్థ సాధించిన ఈ సత్కార్యాన్ని ప్రతి ఒక్కరూ అభినందించ వల్సిందే. 22 తేదీ నరసింగరావు పేటలో నివసిస్తున్న మునిసిపల్ వుద్యోగి భాస్కర రావు తండ్రి, వెంకట సుబ్బయ్య మరణించారు. కుటుంబ సభ్యుల అభ్యర్థన మేరకు డాక్టర్ సి.ఆర్.రెడ్డి నేత్రాలను స్వీకరించి వెంటనే అగర్వాల్ ఐ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌కు పంపినట్లు నేత్ర దాతల సంస్థ సభ్యుడు వి.వి. ప్రభాకర రావు తెలియ జేస్తున్నారు.

### ప్రయాణికుల పై ఆర్టిసి దాదాగిరి!

టైముకు బస్సులు నడిపే దమ్ములు లేకున్నా, ప్రయాణికుల పై దాదాగిరి చేసేందుకు రాపూరు ఆర్టీసి అధికారులు రెడీ అంటున్నారు. 23 తేది ఉదయం 6.15 కు రాపూరు నుండి నెల్లూరుకు వెళ్లే ఫాస్టు సర్వీసు అధికారులు రద్దు చేశారు. బస్సు రద్దు విషయమై తోటి ప్రయాణికులతో వాకబు చేయను స్థానిక డాక్టర్ టి. సురేష్ కూడా వెళ్లారు. ఎంక్వైరీలో వున్న సిబ్బంది బస్సు వుంటేనే ఎక్కండని చెబుతుండడంతో డాక్టర్ ఫిర్యాదు పుస్తకం అడిగారు. ఆర్టీసి డిక్షనరీలో ఫిర్యాదు పుస్తకం వుంటుంది గాని డిపోల్లో గాని బస్సుల్లో గాని అది కనపడదు. పాపం దాన్ని డాక్టర్ అడిగే సరికి సిబ్బందికి కోపం తారాస్థితికి చేరి తమను దూషించారని డాక్టర్ పై కేసు పెట్టారట. మనలో మన మాట; ఎక్కడైనా ఆర్టీసీ డ్రైవర్, కండక్టర్, సిబ్బందితో గొడవ పడే గుండెలు సామాన్యులెవరికైనా వున్నాయా? ప్రజల కోసమే బస్సులు నడుపు తున్నామంటూ నడవని బస్సుల గూర్చి అడిగిన వారి పై కేసు పెట్టిన ఘనత రాపూరు అధికారులకే చివరికి దక్కింది.

### జాలర్లకు మరమోటర్ల పంపిణీ!

జాతీయ, రాష్ట్ర బిసి కార్పొరేషన్ల సహకారంతో తీర ప్రాంతంలోని 246 మంది మత్స్యకారుల కుటుంబాలకు మర మోటార్లు పంపిణీ చేసారు. కావలి, బోగోలు, అల్లూరు, ముత్తుకూరు, తోటపల్లి గూడూరు, ఇందుకూరు పేట, విడవలూరు, చిల్లకూరు, వాకాడు మండలాలకు చెందిన 246 మంది జాలర్లు దీనివల్ల లబ్ధి పొందారు. ఒక మర మోటారును ఇద్దరేసి లబ్ధిదార్ల చొప్పున 123 మర మోటర్ల కోసం 9 లక్షల 84 వేల రూపాయలు వెచ్చించినట్లు బిసి కార్పొరేషన్ అధికారి ఎం.డి. అజామ్ తెలిపారు.

### అయ్యవారి పాళెం హైస్కూల్లో అయ్యవార్ల కరవు!

ప్రభుత్వ పాఠశాలల్లో చదువు అంతంత మాత్రం గానే సాగుతుంటుంది. దీనికి తోడు అయ్యవార్లు లేకుంటే పిల్లలెలా చదువుతారు; పాసౌతారు. పొదలకూరు మండలం అయ్యవారి పాళెం హై స్కూలులో ముఖ్యమైన పాఠ్యాం శాలైన లెక్కలు, సైన్సు, సోషల్ బోధించేందుకు ఉపాధ్యాయులు లేరు. దీనివల్ల స్కూలులో ఉండి కూడా లేనట్లయింది. ఉత్తీర్ణతా శాతం తగ్గి పోతుందని, పిల్లల చదువులు పాడై పోతున్నాయని తల్లిదండ్రుల వేదన.

కొరవ 6 పేజీలో





అల్లూరు టైలర్స్ యూనియన్ ఆధ్వర్యంలో జరిగిన ప్రదర్శనలో రాష్ట్ర అధ్యక్షుడు జానకి రామయ్య, జిల్లా అధ్యక్షుడు బి. శ్రీనివాసులు తదితరులు.

# అరశతాబ్దం తర్వాత మళ్లీ టైయిలర్స్ సంఘం

అల్లూరులో 50 ఏళ్ల క్రితమే టైలర్స్ యూనియన్ వుండింది. తరాలు మారే కొద్దీ అది అంతరించి పోయింది. యువతరంలో మళ్లీ వచ్చిన చైతన్యం 24 తేది బ్రహ్మాండమైన మహాసభ ఏర్పాటుకు దోహద పడింది. జిల్లా వ్యాప్తంగా తరలి వచ్చిన వేలాది మంది టైలర్లు; 'యాక్స్' వాలేశ్వర రావు వంటి కమర్షియల్ టైలరింగ్ యూనియన్ నాయకులు అల్లూరు తరలి వచ్చారు. నినాదాలు, ప్రదర్శనతో గ్రామమంతా హోరెత్తించారు. నూకలపాటి వారి కళ్యాణ మండపంలో అసోసియేషన్ మండల శాఖ అధ్యక్షుడు షేక్ మస్తాన్ సాహెబ్ అధ్యక్షతన సమావేశ మయ్యారు. టైలర్స్ యూనియన్ రాష్ట్ర శాఖ అధ్యక్షులు ఎ.ఎ. నరసింహ మూర్తి మాట్లాడుతూ రాష్ట్రంలోని టైలర్లందరూ సంఘటితంగా లేకపోవడం వల్ల సమస్యలు పరిష్కారం కావడం లేదన్నారు. అసోసియేషన్ చీఫ్ అడ్వయిజర్ సినీ కాస్ట్యూమర్ వై. వాలేశ్వరరావు తన ప్రసంగంలో అన్ని కులాల వారు టైలర్లుగా పని చేస్తున్నప్పటికీ వారి కొక సంఘం లేకపోవడం శోచనీయ మన్నారు. టైలర్లందరిలో చైతన్యం తెచ్చి వారి సమస్యలను ప్రభుత్వం దృష్టికి తెచ్చేందుకు ప్రణాళిక రూపొందిస్తున్నట్లు చెప్పారు. జిల్లా అధ్యక్షులు బి. శ్రీనివాసులు టైలర్లు ఇళ్ల స్థలాలు, మిషన్లు ప్రభుత్వం సబ్సిడీ రూపంలో ఇవ్వాలన్నారు. రేషన్ కార్డులు కూడా లేని టైలర్లు జిల్లాలో చాలా మంది వున్నారని రాష్ట్ర వుపాధ్యక్షుడు పైడా వెంకటేష్ ఆవేదన వ్యక్తపరిచారు. ఒక వ్యక్తి ప్రత్యేక వ్యక్తిత్వమిచ్చే దర్జీ కళాకారులు దుస్థితిలో వుండడం దయనీయ మన్నారు రాష్ట్ర యూనియన్ గౌరవాధ్యక్షులు వై. జానకి రామయ్య, రాష్ట్ర ప్రభుత్వం దృష్టికి టైలర్ల సమస్యలు తీసుకొని వెళ్లేందుకు ఒక కార్యా చరణ పథకాన్ని రూపొం దించాలని సమావేశం తీర్మానించింది.

సమావేశానికి సీనియర్ టైలర్ షేక్ కాలేషా సాహెబ్, జర్నలిస్టు అల్లూరు రహీం ముఖ్య అతిథులుగా విచ్చేసారు. టైలర్స్ యూనియన్ నాయకులు ఎం.ఆర్. రావు, ఎం. పెరుమాళ్లు, కె.ఎం. స్వామి, శ్రీమతి వై. రంగబాయి, పి. విజయ లక్ష్మి, షేక్ అహమ్మద్ భాష, షేక్ బాషా, జీ. ఆనంద్ వేదిక పై ఆశీనులయ్యారు. అల్లూరు టైలర్స్ యూనియన్‌కు చెందిన కొడవలూరు వెంకటేశ్వర్లు తొలుత స్వాగతం చెప్పి చివరన వందనాలు చెల్లించారు. యూనియన్ కన్వీనర్ షేక్ బాబు, మహబూబ్ బాషా, రషీద్, నాయిబా కరీముల్లా కార్యక్రమం విజయ వంత మయ్యేందుకు విస్తృతంగా శ్రమించారు.

### గూడూరు రిటైర్డ్ టీచర్ల సమావేశం

గూడూరు రిటైర్డ్ టీచర్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశం రిటైర్డ్ హెడ్మాస్టర్ కె. శంకరయ్య అధ్యక్షత జరిగింది. సమావేశానికి జిల్లా రిటైర్డ్ టీచర్స్ అసోసియేషన్ అధ్యక్ష కార్యదర్శులు కె. సంపత్ కుమార్, పి. కోటయ్య హాజరయ్యారు.

# నెల్లూరు సంగతులు

నాల్గవ పేజీ కొరవ

ఆధార పడవలసిన అవసరం లేదు. బలహీన వర్గాల వారంతా ఏకమయితే రాష్ట్రంలో విప్లవం తీసుకొని రావచ్చని ధీమా వ్యక్తం చేశారు. బలహీన వర్గాల్లో చీలిక తెచ్చేందుకు కులాల వారీ సమావేశాలు పెడుతున్నారని ఈ విషయంలో జాగ్రత్తగా వుండాలని కోరారు. నెల్లూరు సభలో లేవనెత్తిన అంశాలను ప్రధాని దృష్టికి తీసుకెళ్లి పరిష్కరించేందుకు కృషి చేస్తానని మంత్రి హామీ కూడా ఇచ్చారు. పి.సి.సి. మాజీ అధ్యక్షుడు, ప్రస్తుతం రాజ్యసభ సభ్యులైన వి.హనుమంతరావు మాట్లాడుతూ రానున్న శాసనసభ ఎన్నికల్లో నెల్లూరు జిల్లాలో బిసిలకు నాలుగు సీట్లు కేటాయించమని ప్రధానిని కోరుతానన్నారు. కాస్త్రీరాం వున్నవి లేనివి గోరంతలు కొండంతలు చేస్తూ గ్రామాల్లో రక్తపాతం సృష్టించాలని చూస్తున్నట్లు చెప్పారు. మాజీ ఉపముఖ్యమంత్రి సి.జగన్నాథరావు నెల్లూరు సభ ద్వారా రాష్ట్రంలో నూతన అధ్యాయం సృష్టించి ప్రభుత్వానికి ఒక గుణపాఠం నేర్పను తానిక్కడకు వచ్చినట్లు చెప్పుకొన్నారు. లంచాలు, సారాకు ఓట్లిచ్చినంత కాలం బలహీన వర్గాలకు న్యాయం జరగదని సర్దార్ గౌతు లచ్చన్న చెప్పారు. కనపడితే కాల్చండన్న రోజుల్లో తాను కాంగ్రెస్ వాదినేనని, కనపడిందల్లా జేబుల్లో వేసుకునే నేతలున్న ఈ రోజుల్లో ఆ పార్టీలో వుండలేక బయటికి వచ్చానన్నారు. కార్యక్రమ నిర్వాహకుడు రావుల అంకయ్య గౌడు మాట్లాడుతూ తాను కోటీశ్వరుల కొడుకులకు వ్యతిరేకిని. జనార్దన రెడ్డి కొడుకు కోట్ల రూపాయల గ్రానైట్ వ్యాపారం చేస్తుంటే, ఎసి సుబ్బారెడ్డి కొడుకు కోళ్లు అమ్ము కుంటున్నాడు. జనాభా ప్రాతిపదికన జిల్లాలో బలహీన వర్గాలకు రాబోయే అసెంబ్లీ ఎన్నికల్లో ఆరు సీట్లు ఇవ్వకపోతే 11 సీట్లలో పోటీ చేస్తామన్నారు. బలహీన వర్గాలకు కేటాయించే సీట్ల విషయం ముందుగానే తెలుపకపోతే కాంగ్రెస్‌కు ఎవ్వరూ ఓటు చేయకూడదని ఆహ్వాన సంఘం అధ్యక్షుడు ముంకు వెంకటేశ్వర్లు కోరారు. మాజీ ఎమ్మెల్యేలు బాలగౌడ్, కె.పి.రెడ్డయ్య యాదవ్, మాజీమంత్రి కె.ఇ. కృష్ణమూర్తి, [illegible] నిర్వాహక బలహీన వర్గాల నాయకులు బి.రాధయ్య, టి.కోటయ్య తదితరులు మాట్లాడారు. సభకు ముందు ఎసి సుబ్బారెడ్డి స్టేడియం నుండి భారీ ప్రదర్శన కూడా నిర్వహించారు. బలహీన వర్గాలకు రాజకీయ ప్రాధాన్యత కల్పించాలన్న ప్రధాన డిమాండుకు తోడుగా మరో ఎనిమిది చిన్నా చితకా తీర్మానాలు సభ చేసింది.

మొత్తమ్మీద బలహీన వర్గాల పేరిట బలిసిన వారు జరిపిన ఈ సభ నానాభంగోళిగా, కలగూర గంపలా సాగింది. కాకపోతే కేంద్ర మంత్రి వెంకట స్వామి, కాస్త్రీరాం తాజా అనుచరుడు (పాతోన్ను) గౌతు లచ్చన్న ఒక వేదిక మీద కలవడ మేమిటి? కాంగ్రెస్ నుంచి సస్పెండ్ అయిన అంకయ్య గౌడ్‌తో మాజీ పిసిసి అధ్యక్షుడు వి. హనుమంత రావు వేదిక పంచుకోవడమేమిటి? మాజీ మంత్రి కె.ఇ. కృష్ణమూర్తికి మాగీ ఉవి ముఖ్యమంత్రి సి. జగన్నాథరావుకు ఏమిటి లంకె? ఇప్పుడు బిసిలకు అందరూ నాయకులే అయ్యారు! ఇంత కాలం బలహీన వర్గాలంటే ఎవరో తెలియ కుండా తెలిసినా పట్టించు కోకుండా సారాయి వ్యాపారాల్లో కోట్లు ఆర్జించడమే లక్ష్యంగా ఎంచుకొన్న వాళ్లకు ఇప్పుడు తమ రాజకీయ కక్షలు, ద్వేషాలు తీర్చుకోడానికి బిసి వేదికలు కావలసి వస్తున్నాయి. బిసిలంటే ఎవరో తెలియని వాళ్లు కూడా బిసిల కోసం మొసలి కన్నీళ్లు కారుస్తున్నారు. అంకయ్య గౌడ్ వంటి వారు బలహీనుల చాంపియన్లుగా ముఖానికి రంగు పూసుకొని స్టేజిలెక్కితే బలహీన వర్గాల ప్రయోజనాలు నెరవేరినట్లే! ఓట్ బ్యాంక్ కొల్లగొట్టాలనే దృష్టి తప్ప, ఈ నాయకులకు నిజంగా బలహీనులపై ప్రేమ, సానుభూతి వున్నాయా అన్న ప్రశ్న ఆ సభలోనే విన వచ్చింది. కాకపోతే బిసిలు ఆరాధిస్తున్న కాస్త్రీరాంను వి. హనుమంతరావు విమర్శించడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? అసలు బిసిల సభకొచ్చి కాస్త్రీరాంను విమర్శించడం ఎంత తెలివి తక్కువో మన నాయకులకు తెలియక పోవడం దౌర్భాగ్యం. ఇది [illegible] సభ వల్ల బిసిలకు ఒరిగిందేమిటన్న ప్రశ్నకు సమాధానం లేదు. మహా అయితే అంకయ్య గౌడ్ తన 'ప్రభ' చాటుకో వడానికి మాత్రమే ఇది పని కొస్తుంది. ఆ ప్రభ అయినా నిలిచిందా అంటే అదీ లేదు. తుస్సుమని పోయింది. ఇంతే సంగతులు!

## పొదుపు లక్ష్మిపై ప్రశంసల జల్లు

జిల్లా ఇన్‌ఛార్జి మంత్రిగా కొత్తగా నియమితులైన రాష్ట్ర ఉన్నత విద్యాశాఖ మంత్రి ఆలపాటి ధర్మారావు తొలిసారిగా అధికారులు, ప్రజా ప్రతినిధులతో 26 తేదీ సమావేశమయ్యారు. జిల్లాలో జరుగుతున్న అభివృద్ధి పథకాల అమలు పట్ల మంత్రి సంతృప్తి చెందిన విషయం, ఆయన మాటల్లో వెల్లడయ్యింది. దేశంలోనే పొదుపు లక్ష్మి వుద్యమం ప్రగతి బాటన సాగుతున్న నెల్లూరు జిల్లాను సారా నిషేధ ఉద్యమంలా ఇతర జిల్లాలు ఆదర్శంగా తీసుకొని అనుసరించ గలవన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారాయన. జూన్ నెలాంతానికి జిల్లాలో రెండు లక్షల మంది మహిళలు 6,250 గ్రూపులుగా ఏర్పడి 2 కోట్ల 11 లక్షలు పొదుపు చేసినట్లు చెప్పారు. అధికారులు రూపొందించిన విధానాల వల్ల ఇకనుండి ప్రతినెల జిల్లాలో 60 లక్షల రూపాయలు పొదుపు లక్ష్మి పథకంలో వచ్చి చేరుతాయట. జిల్లాలో మహిళా చైతన్యం చూసి కేంద్ర ప్రభుత్వం దేశంలో ఎక్కడాలేని విధంగా వెయ్యి 'డ్వాక్రా' గ్రూపులు మంజూరు చేసిందని, దీనివల్ల గ్రూపుకు 15 వేల రూపాయల ఋణం లభిస్తుందని వివరించారు.

ప్రజల్లో పనిచేసే విధానాన్ని అలవర్చేందుకు గ్రామాల్లో కొత్తగా ఎంప్లాయిమెంట్ గ్యారంటీ స్కీం చేపట్టనున్నారట. జిల్లాలో దీనికోసం 31 మండలాలు ఎంపిక చేశారు. 4.50 కోట్లు ఖర్చు చేసే పథకానికి ఇప్పటికే 2.30 కోట్లు విడుదలయ్యాయి. గ్రామాల్లో ప్రజలను బ్యాచ్‌లుగా విభజించి పనులు అప్పగిస్తారు. ఎంత తక్కువ అనుకున్నా 30 రూపాయల దిన కూలీ పనిలేని దినాల్లో తప్పక గిట్టుతుందని అధికారులు భరోసా ఇస్తున్నారు. ప్రజల కోరిక మేరకు జవహర్ రోజ్‌గార్ నిధుల మిగులునుండి 2 కోట్ల రూపాయలు మళ్లించి. కోటి రూపాయలతో ఇందిరా ఆవాజ్ యోజన ద్వారా పక్కా గృహాలు, మిగతా వాటితో పూడిపర్తి, కుడితిపాళెం, కప్పురాళ్ల తిప్ప గ్రామాల్లో చేపల, రొయ్యల చెరువులు త్రవ్వుకొనేందుకు ఋణాలు ఇస్తారట. జిల్లా కలెక్టర్ ఎం.సాంబశివరావు మెదడులో అప్పుడప్పుడు కొత్త ఆలోచనలు పుడుతుంటాయి ; అటువంటిదే 'చెట్టు పట్టా' పథకం. హైవే ప్రక్కన నాటేందుకు 60 వేల పండ్ల మొక్కలు పంపిణీ చేస్తారు. వీటిని పెంచేందుకు 2 వేల మంది గ్రామీణ మహిళలను ఎంపిక కూడా చేశారు. ఒక్కొక్క మహిళకు 25 చెట్లకు పట్టా ఇస్తారు. నీటి వసతి, ఎరువులు, ఆరేళ్లపాటు చెట్ల పోషణకు 99 లక్షలు కేటాయించారు. ఫలసాయం గ్రామీణ మహిళలే అమ్ముకోవచ్చని జిల్లా కలెక్టర్ చెప్పారు.

బహుశ సారా వుద్యమం, పొదుపులక్ష్మి పథకాల పట్ల మహిళచూపిన వుత్సాహానికి కలెక్టర్ చేకూర్చిన నజరానా ఈ పథకం.

పల్లెబాట పారిశుద్ధ్య పథకంలో భాగంగా 3 కోట్ల రూపాయలు వెచ్చించి గ్రామీణ ప్రాంతాల్లో 10

వేల లెట్రిన్లు నిర్మిస్తున్నట్లు మంత్రి తెలిపారు. అదే విధంగా హైస్కూళ్లలో మరుగుదొడ్ల నిర్మాణానికి 25 వేల రూపాయల లెక్కన విడుదల చేస్తారు. తీర ప్రాంతంలో అదనంగా మరో 18 తుఫాన్ షెల్టర్ల నిర్మాణం కోసం స్విట్జర్లాండ్ సహాయం కోరి వున్నట్లు చెప్పారు. 100 పైగా హరిజన, గిరిజన వాడల్లో మంచినీటి వసతి కల్పించేందుకు 176 లక్షలు మంజూరు చేయమని ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపినట్లు వివరించారు. నాయుడుపేటలో స్వర్ణముఖి నదిపై పునర్నిర్మిస్తున్న వంతెన మార్చి 95కు పూర్తి చేయమని ఆదేశించినట్లు చెప్పారు. అభివృద్ధి విషయాలు పరిశీలించను తప్ప పార్టీ ఎమ్మెల్యేల పనితీరును చూడడానికి రాలేదని ఒక ప్రశ్నకు జవాబుగా మంత్రి విలేఖరులకు తెలిపారు. ఎమ్మెల్యేలు సివి శేషారెడ్డి, మాదాల జానకిరాం, ప్రసన్నకుమార్ రెడ్డి మాత్రమే ప్రజా ప్రతినిధులవైపు జిల్లా అభివృద్ధి మండలి సమావేశంలో పాల్గొన్నారు. కలెక్టర్ ఎం.సాంబశివరావు, జాయింట్ కలెక్టర్ సతీష్‌చంద్ర, డిడిఒ వి.ఎస్.విష్ణు వివిధ శాఖాధికారులు సమావేశానికి హాజరయ్యారు. జిల్లా అధికారుల పనితీరు కూడా మంత్రి బహుదా ప్రశంసించి మెచ్చి వెళ్లారు.

## ప్రజారోగ్య వైద్య ఉద్యోగుల జిల్లా మహాసభ

ఆంధ్రప్రదేశ్ ప్రజారోగ్య వైద్య ఉద్యోగుల సంఘం జిల్లా మహాసభ 17 తేదీ ఐ.ఎన్.టి.యు.సి రాఘయ్య అధ్యక్షతన ఎన్జీఓ హోమ్‌లో జరిగింది. ముఖ్య అతిథిగా విచ్చేసిన రాష్ట్ర గృహ నిర్మాణశాఖ మంత్రి పసల పెంచలయ్య మాట్లాడుతూ వైద్య వుద్యోగుల సమస్యల పరిష్కారానికి ప్రభుత్వంతో కూడా మాట్లాడను సంసిద్ధ వ్యక్తం పరిచారు. ఆరోగ్యాన్ని సంరక్షించే వైద్య వుద్యోగులు సమస్యలతో సతమత మవడం పట్ల ప్రభుత్వ విప్ సివి శేషారెడ్డి ఆవేదన వ్యక్తపరిచారు. ప్రభుత్వ ప్రధాన ఆసుపత్రి సూపరింటెండెంట్ డాక్టర్ కృష్ణారెడ్డి వైద్య వుద్యోగులు పరస్పర అవగాహనతో పరిష్కరించుకోగల సమస్యలుంటే ముఖాముఖి రప్పించి పరిష్కరించ గలనన్నారు. వుద్యోగుల కోర్కెలు సబబుగా వున్నాయని ఎమ్మెల్యే జికె రెడ్డి మద్దతు తెలిపారు. ఎంప్లాయిస్ యూనియన్ అధ్యక్షులు కె. జనార్దనరెడ్డి, ఐఎన్‌టియుసి జిల్లా అధ్యక్షులు వాసుదేవరావు కూడా సభలో మాట్లాడారు. ఇటీవల రిటైర్ అయిన వైద్య వుద్యోగులు పకీరయ్య, ఎ. రామయ్య, ఆర్. మస్తానయ్య మంత్రి, ఎమ్మెల్యేల చేతుల మీదుగా సన్మానింప చేశారు. భారీ ఏర్పాట్లతో సభ నిర్వహించి, అందరినీ ఆహ్వానించినా జిల్లా వైద్యాధికారి ఎందువల్లో కార్యక్రమానికి హాజరుకాలేదు.

## జాతీయ స్థాయిలో వ్యాసరచన పోటీలు

ఎరోడా లోని చంచల బాబా అమాన్ ఛారిటబుల్ ట్రస్ట్ జాతీయ స్థాయిలో వ్యాసరచన పోటీలు నిర్వహిస్తుంది. పోస్ట్ గ్రాడ్యుయేట్లు, గ్రాడ్యుయేట్లు పోటీలో పాల్గొనేందుకు అర్హులు. మానవ వనరుల అభివృద్ధి -దాని ప్రాముఖ్యత, అనే అంశంపై వ్యాసాలను ఇంగ్లీషులో 2వేల పదాలకు మించకుండా టైపు చేయించి మూడు కాపీలుగా పంపాలి. విద్యార్థులు తాము చదువుతున్న కాలేజితో పాటు స్వంత చిరునామా పేర్కొనాలి. ప్రిన్సిపాల్ ధృవ పత్రాన్ని జతపరచి అక్టోబర్31తేదీలోగా రిజిష్టర్ పోస్టులో క్రింది చిరునామాకు పంపాలి. సెక్రటరీ, ఫోరం ఆఫ్ ఫ్రీ ఎంటర్ ప్రైజెస్, పిరామల్ మాన్షన్ మూడవ అంతస్తు, 235 డాక్టర్ డి.ఎన్ రోడ్, బొంబాయి-1 కు పంపాలని సంస్థ కార్యదర్శి ఎన్. దివాకర్ కోరుతున్నారు.

## రెడ్‌క్రాస్ రక్తనిధికి సన్నాహక సమావేశం

భారత దేశంలోనే తొలిసారిగా జిల్లాస్థాయిలో రెడ్ క్రాస్ సంస్థ బ్లడ్ బ్యాంకు ఏర్పాటుకు నెల్లూరులో శ్రీకారం చుట్టింది. ఇందుకోసం ఇటీవల రెడ్‌క్రాస్ సంస్థ జిల్లా కార్యాలయంలో జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివరావు అధ్యక్షతన సన్నాహక కమిటీ సమావేశం జరిపింది. వేదికపై డాక్టర్లు జెట్టి శేషారెడ్డి, ప్రభాకర్, ఎవి సుబ్రహ్మణ్యం, రెడ్‌క్రాస్ జిల్లా ఉపాధ్యక్షుడు జెక్సాక్ జైన్ ఆసీనులయ్యారు. బ్లడ్ బ్యాంక్ యొక్క ఆవశ్యకతను రక్తదాతల సంఘం అధ్యక్షులు టి. సుకుమార్ రెడ్డి వివరించారు. 20లక్షల రూపాయల వ్యయంతో బ్లడ్ బ్యాంకును ఏర్పాటు చేయాలని సమావేశంలో నిర్ణయించారు. ఈ నిధినంతా [illegible] రూపంలో సేకరిస్తారు. [illegible]లోనే 3లక్షల రూపాయల [illegible] వచ్చాయి. అనుకున్న [illegible] పదిలక్షల రూపాయలు ఫిక్స్ డిపాజిట్‌గా చెస్తారు. మిగతా 50లక్షల, జాతీయ ప్రమాణాలతో బ్యాంక్ వుండేటట్లు పరికరాలు, యంత్రాలు, సమ కూర్చాలని ఆలోచన. జిల్లాకలెక్టర్ ప్రభుత్వం తరుపున మద్రాస్ బస్టాండ్ వద్ద ఒక భవనాన్ని సమకూరుస్తానన్నారు. ఈ మొత్తం కార్యక్రమానికి కన్వీనర్‌గా డాక్టర్ జెట్టి శేషారెడ్డిని ఎన్నుకున్నట్లు రెడ్‌క్రాస్ వ్యవహారాలు చూస్తున్న డాక్టర్ సుబ్రహ్మణ్యం చెప్పారు.

## శివారెడ్డి పద్యాలు

### శ్రీ రమణ మహర్షి

ఏ జన్మాంతర సుకృతమో
ఈ జన్మము నందు ఇప్పుడు
నేనిక [illegible] పూజించితి విమలతేజ
రాజీవ యుగమ్ము వాలునా శ్రీరమణ!

### గుళ్ళు దేవాలయములు

దేవుడున్న గుళ్ళు దేవాలయాలన్న
పరుగులెత్తు వాళ్లే పడుతూలేస్తూ
[illegible] కొచ్చి అన్నీ వదలి పారేసి
లేనిపోని ఖర్చు దేనికంట!

### రామిరెడ్డి

మంచి పెద్ద మట్టు మర్యాద గలవాడు
పేద సాదలంటె ప్రీతి మెండు
మాకు దగ్గరోరు మావూరి మునసబు
రామిరెడ్డి అదొక రకం టైపు!

## పంచాంగం

ఆశ్లేష కార్తె

### జూలై తిథులు

ఆషాఢ బహుళ

తే30 శని అష్టమి పూర్తిగ
తే31 ఆది అష్టమి ఉ.గ. 6.14 వ

### ఆగస్టు తిథులు

తే1 సోమ నవమి ఉ.గ. 8.2[illegible] వ
తే2 మంగళ దశమి ఉ.గ. 10.14 వ
తే3 బుధ ఏకాదశి ఉ.గ. 11.5[illegible] వ
తే4 గురు ద్వాదశి ప.గ. 1.1[illegible] వ
తే5 శుక్ర త్రయోదశి ప.గ. 2.[illegible] వ
స్వయంపాకుల శ్రీనివాసులు [illegible]

## నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9672 | 3,[illegible]/- |
| 9674 | 3,400/- |
| ఐ.ఆర్. 64 | 3,000/- |
| సన్నాలు | 2,900/- |

# బూతులేనిదే బతకలేరట!

చలన చిత్రాలలో హింస, సెక్స్ సన్నివేశాలను విచక్షణా రహితంగా - నిర్లక్ష్యంగా తొలగి స్తున్నందుకు నిరసనగా జూలై 19 తేది ఉదయం మద్రాసులో సినిమా నటీ నటులు, సాంకేతిక నిపుణులు, కార్మికులు మౌన ప్రదర్శన జరిపారు. సెన్సార్ బోర్డ్ అధికారులకు ఈ విషయమై ఒక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించారు. వీళ్ళ ఒత్తిడికి లొంగి సెన్సార్‌వారు గనుక సరళతరంగా ఉంటే, ఇటువైన సినిమాలే చూడమని కొన్ని మహిళా మండలి సభ్యురాళ్ళు పత్రికా ముఖంగా హెచ్చరించారు. ఇటీవల వెలువడిన ఒక తమిళ చిత్రంలోని ఒక పాట అనువాదాన్ని చూస్తే, అశ్లీలం విషయంలో తమిళ సినిమాలు మన తెలుగు సినిమాలతో తీసి పోవని తెలుస్తుంది. నాయిక ఆటోడ్రైవరు. ఆ అమ్మాయిని ఉద్దేశించి హీరో ఇలా అంటాడు:

అబ్బాయి: ఆటోరాణీ! హారన్ కాస్త నొక్కి చూసేదా?

మీటర్ వేసి సీటు ఎక్కి,

* సెన్సార్ మీద సినీ పరిశ్రమ కినుక
* సినిమాలపై మహిళల కోపం
* తెలుగును మించిన తమిళ బూతు

తోలి చూసేదా?

అమ్మాయి: అబ్బాయి, ఏ ఊరు నీది?

అబ్బాయి: ఎక్కెవల్లి.. ఎక్కనా ఆటోలో?

అమ్మాయి: ఈ పూట పిలవదల్చి రాత్రంతా ఆయుధ పూజ కదా! అర్థమైన వాళ్ళంతా ఎక్కితే అరిగి పోతుంది బండి. ఆపైన ఇంజన్ సమసిపోయి, ఆయిల్ చల్లుతుంది. తట్టుకోలేరసలు ఏ బండి ఓవర్ వెయిటు. కూర్చుంటే వెళ్ళలేరు ఓవర్ స్పీడు.

కాని, ఏరోడ్ అయినా ఫర్వాలేదు ఈ ఆటోకు అని స్వారీ చేసిన వాళ్ళందరికీ తెలిసిన సత్యమిది...

సహృదయులైన ప్రేక్షకులకు పై పాటలో ద్వంద్వార్థాలు స్ఫురించవని ఆ చిత్ర దర్శక నిర్మాతలు సంజాయిషీ!



సాధు చిత్రంలో రవీనాటాండన్, అర్జున్

## బాపు దర్శకత్వంలో శోభన్‌బాబు

బాపు రమణలు వయసు మీదపడ్డ కొద్దీ రిలాక్స్ అయి పోతున్నారేమో నని కొందరు అభిప్రాయపడడానికి ఇటీవల విడుదలైన వారి చిత్రాలే తార్కాణాలు. "బుద్ధిమంతుడు" "జాకీ" అనంతరం బాపు దర్శకత్వంలో శోభన్‌బాబు రెండు పాత్రలు నిర్వహించే చిత్రం షూటింగ్ ఈ సంవత్స రాంతంలో మొదలవు తుంది. ముళ్ళపూడి వెంకటరమణ రచయిత.

# కుష్‌బూతో గోవింద... గోయిందా?

హిందీ నటుడు గోవిందా మద్రాసు వచ్చినప్పుడల్లా కుష్బూ ఇంటికి వెళ్తున్నాడు. ఒక్కోసారి ఆమె ఇంట్లోనే బస చేస్తున్నాట కూడాను. కుష్బూ, గోవిందా కలిసి చాలా కాలం క్రితం ఒక హిందీచిత్రంలో నటించారు. అది ఇంకా వెలుగు చూడలేదు. ఆ పాతస్నేహాన్ని పురస్కరించుకొని ఆమెను తరచు కలుసు కుంటున్నట్లు గోవిందా చెప్పుకుంటున్నాడు. ఒకప్పుడు తమిళ సినిమా రంగంలో

## మద్రాసు సినిమా వార్తలు

'నెంబర్ 1' హీరోయిన్‌గా పేర్గాంచిన కుష్బూకు హీరో ప్రభుతో వివాహం జరిగినట్లు వార్త వచ్చినప్పట్నుంచి తమిళ చిత్రాలు బాగా తగ్గిపోయాయి. అందుకని ఆమెను మళ్ళీ బొంబాయికి తీసుకెళ్ళి, బిజీ హిందీ స్టార్‌ని చేయాలని గోవిందా ఆరాటపడుతున్నట్లుంది. ఈ సమయంలో తనకు ఆసరాగా దొరికిన గోవిందా మాటలను ఆమె విశ్వసిస్తోంది. బొంబాయిలో ఆమె ప్రకాశించ గలిగితే మంచిదే. లేకపోతే -గోవిందా..గోవింద!

## నెల్లూరీయుల చిత్రంలో వెంకటేష్, విజయశాంతి

"అమ్మోరు" చిత్రం విడుదల అనంతరం 'సహజకవి' మల్లెమాల సుందరరామిరెడ్డి సమర్పణలో ఆయన తనయుడు ఎం. శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి నిర్మించే చిత్రంలో వెంకటేష్, విజయశాంతి ప్రధాన పాత్రధారులు. బ్యానర్ వ్యాల్యూ వున్న సంస్థ ఎంఎస్‌ఆర్ మూవీస్.

## పరుచూరి సోదరుల పచ్చి సంభాషణలు

సుప్రసిద్ధ రచయితలు పరుచూరి సోదరుల వంటి వారు సైతం" దొరగారికి దొంగ పెళ్ళాం" చిత్రంలో ఎంత చవకబారు సంభాషణలు రాశారో చూడండి. కోటతో కృష్ణ: "రహస్యంగా చేయవలసింది శోభనం; పబ్లిగ్గా చేయ వలసింది పెళ్ళి ".జయసుధతో కృష్ణ: "ఏమో మారుతి కారనుకున్నాలే ఎక్కి కూర్చోవ డానికి". విజయశాంతితో కృష్ణ: "అమ్మకానికి పెట్టి, పెట్టుకోవద్దంటే ఎలా?".

కృష్ణతో జయసుధ: "అబ్బో.. మీకు మూడొస్తే, తెల్లారి మూడు వరకు వదలు!".

విలన్‌తో విజయశాంతి: "లంగా ఓణీ కట్టించి, తొక్కుడు బిళ్ళ ఆడిస్తాను".

కృష్ణతో విజయశాంతి: "డబ్బు లివ్వకుండా చక్రంమీద చెయ్యేస్తే ఊరుకోను".

విజయశాంతి: "ఆడ పిల్లను చిన్నతనంలో నగ్నంగా చూసేది తల్లి. పెద్దయ్యాక నగ్నంగా చూడగలిగేది భర్త మాత్రమే!"

కొరవ 10 పేజీలో



# 'సర్' - నిలువునా మర్డర్ గ్యాంగ్ మాస్టర్

హిందీలో విజయవంతమైన 'సర్' చిత్రానికి రీమేకే గాంగ్ మాస్టర్. 'సర్' చిత్రాన్ని చూసి వుండే ప్రేక్షకులు తెలుగు 'గ్యాంగ్ మాస్టర్' చిత్రాన్ని చూచి పెదవి విరవడం ఖాయం. ప్రతిభావంతమైననటీ నటులను ఎంచుకొని చిత్రాన్ని నిర్మించి కూడా పూర్తి న్యాయం చేకూర్చలేక పోయారు దర్శకుడు బి. గోపాల్. హిందీ 'సర్' చిత్రంలో 'మాస్టర్' పాత్ర ఎంతో వుదాత్తంగా తీర్చి దిద్దబడింది. అటువంటి మాస్టర్లు నిత్యజీవితంలో వుంటారా అని ప్రేక్షకులు విస్తుపోయి ఆ చిత్రాన్ని తెగ చూసేశారు. కాని మన మాస్టారుకు గ్లామర్ హంగులు అద్దబడ్డాయి. మాస్టారును ఢీ కొట్టడం కోసం, సిగ్గులెంతవరకు నీ చిరమ్మజారువరకని పరకని చవకబారు పాటలు పాడుకోవడం కోసం స్టూడెంట్ రూపంలో అదనపు హీరోయిన్‌ను జతచేశారు. ఈ హీరోయిన్ వద్ద తప్ప, మిగతా చోట్ల మాస్టారుగారు అదర్శవంతుడే! అదే విధంగా మాస్టారు-విద్యార్థుల మధ్య అవ్యాజ ప్రేమానురాగం పెంపొందింప బడడానికి కారణభూతమైన ఒక సన్నివేశం కూడా చిత్రంలో లేదు. ఈరోజుల్లో ఒక స్టూడెంట్ చొక్కా కాలర్‌ను లెక్చరర్ పట్టుకుంటే, స్టూడెంట్లు వూరుకోవుండడం ఎంత మాత్రం వాస్తవమో దర్శకుడికే తెలియాలి. చిత్ర కథ ప్రధానంగా రెండు మాఫియా గ్యాంగులు, ఒక లెక్చరర్, ఇద్దరు ప్రేమికుల మధ్య నడుస్తుంది. మహేష్ భట్ వ్రాసిన హిందీ చిత్ర కథలో ప్రేమికులకు ప్రాధాన్యమిస్తే తెలుగులో భారీ నట సంగమం వల్ల ప్రేమికులను పులకింప చేసే సన్నివేశం ఒకటి కనపడదు. చిత్రంలో 'ప్రేమికుడు' మాఫియా కింగ్ గారి కూతురు కోసం ఇంటి గోడలు అలవోకగా దూకి రెడీగా లాన్‌లో వుండే కంకరరాళ్లతో ప్రేమ సందేశాలు అందిస్తుంటాడు. బ్లాక్ క్యాట్ కమెండోలన్నా కునుక తీస్తారేమోగాని మాఫియా గ్యాంగుల సెక్యూరిటీ పొరపాటున ఆదమరవరన్న విషయం దర్శకుడు మరిచి పోయినట్లుంది. కొత్త గొంతుకల స్వరాలతో కలసి రెహమన్ వెలువరించిన సంగీతం, పరుచూరి బ్రదర్స్ పదునైన మాటలు, చక్కగా

* అల్లూరు రహీం

సాగిన కామెడీ ట్రాక్ ప్రేక్షకుల మనసులకు కాసింత రిలీఫ్ నిస్తాయి.

కథ విషయానికొస్తే మాఫియా కింగులైన పురుషోత్తం (కృష్ణంరాజు) చక్రవర్తి (చరణ్‌రాజ్) లంటే పట్టణంలోని ప్రజలు హడలి చస్తుంటారు. ఈ వర్గ పోరాటాల్లో పురుషోత్తం తన భార్యను, చక్రవర్తి తన తమ్ముడ్ని కోల్పోతారు. పురుషోత్తం తన ప్రాణం కన్నా మిన్నగా చూసుకునే తన కుమార్తె పూజ(శుభశ్రీ) కి ట్యూషన్ చెప్పమని లెక్చరర్ రాజ (రాజశేఖర్) ను తన మాఫియా ట్రిక్కులు చూపి కోరతాడు. ఒకప్పటి ఈ మాఫియా గ్యాంగుల మూలంగా తన బిడ్డను కోల్పోయి భార్య సంధ్య(నగ్మా ) లకు దూరమైన లెక్చరర్ ఈ ప్రతిపాదననిరాకరిస్తాడు. ఒక సిన్సియర్ స్టూడెంట్ చదువు మానెయ్యడం ఇష్టంలేక ట్యూషన్ చెప్పను అంగీకరించడు వెళ్ళిన రాజ పురుషోత్తం కు దగ్గరవుతాడు. ఆ చొరవతో సమాజ క్షేమం కోసం రెండు గ్యాంగులను కలిపి గ్యాంగ్ మాస్టర్ అవుతాడు. ఆ రెండు గ్యాంగుల కలయిక తాత్కాలిక మవుతుంది. ఒకరికి తెలియకుండా మరొకరు చాటుమాటుగా కత్తులు దూసుకొంటుంటారు. తన క్లాస్‌మేట్ బాలు (చంద్రశేఖర్) ను ప్రేమించిన పూజ ప్రేమను పురుషోత్తం అంగీకరించడు. ఈ ప్రేమకు మద్దతు తెలిపిన మాస్టారుపై మండిపడతారు. మాఫియా గ్యాంగుల మధ్య ప్రేమ జంటను దాచే ప్రయత్నంలో తనకు దూరంగా వున్న భార్యను కూడా పోగొట్టుకుని, చివరకు ఆ ప్రేమ జంటను కలుపుతాడు మాస్టారు.

చిత్రంలో ఆదర్శాలు వల్లెవేసి త్యాగాలు చేసే మాస్టర్ పాత్రధారి

కొరవ 10 పేజీలో

## కృష్ణాపట్నం

( మొదటి పేజీ తరువాత )

### టెండర్ల కథ

విద్యుత్ కొరతను నివారించటానికి ప్రైవేటు రంగంలో విద్యుదుత్పాదనకు అనుమతించాలని 1990 లో కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. అధికార కొరతతో సతమత మవుతున్న మన రాష్ట్రం కూడా దీనికి స్పందించి ప్రైవేటు రంగంలో విద్యుదుత్పాదనకు సిద్ధం కట్టింది. కృష్ణపట్నం థర్మల్ విద్యుదుత్పాదన కేంద్రం ఏర్పాటు ప్రతిపాదన తొమ్మిదవ పంచవర్ష ప్రణాళికలో వుండగా అప్పటి ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధన రెడ్డి చొరవ తీసుకొని కృష్ణపట్నం విద్యుత్ కేంద్రాన్ని ఎనిమిదో ప్లానుకు అద్దాన్ని చేసి కేంద్ర ప్రభుత్వం చేత ఆమోద ముద్ర వేయించారు. ఈ విషయం తెలిసిన తర్వాత అమెరికాకు చెందిన బ్రూక్లిన్ కంపెనీ హైదరాబాదుకు చెందిన అపోలో హాస్పిటల్స్ గ్రూపు వారు కృష్ణపట్నం ఏర్పాటుకు దరఖాస్తు చేసుకున్నారు. అయితే కృష్ణపట్నం థర్మల్ కేంద్రం ఏర్పాటు కోరుతూ గ్లోబల్ టెండర్లు పిలవాల్సిందిగా 1993 లో ముఖ్యమంత్రి కోట్ల ఆదేశించారు. ఆ మేరకు స్వదేశీ, విదేశీ కంపెనీలు టెండర్లు పంపుకున్నాయి. ఈ టెండర్లను పరిశీలించటానికి ఒక సాంకేతిక కమిటీని నియమించారు. ఈ కమిటీ ఆయా కంపెనీల బాగోగులను విశ్లేషిస్తూ రిపోర్టు ఇచ్చింది. దీంట్లో జి.వి.కె. ఇండస్ట్రీస్ సామర్థ్యాన్ని కమిటీ ప్రశ్నించింది. రెండేళ్ల క్రితం జేగురుపాడు (తూ.గో. జిల్లా) లో జి.వి.కె. ఇండస్ట్రీసుకు కేటాయించిన 400 మెగావాట్ల గ్యాస్ ఆధారిత విద్యుత్ ఉత్పాదన కేంద్రం ఏర్పాటులో ఏ మాత్రం పురోగతి లేనందున తిరిగి ఈ కంపెనీకు కృష్ణపట్నం పని అప్పగిస్తుటం సమంజసమా? అన్న వాదనను టెక్నికల్ కమిటీ వ్యక్తపరచింది. ఈ విషయాన్ని మంత్రి మండలి సమావేశంలో పి. జనార్ధన రెడ్డి స్వయంగా లేవనెత్తారు కూడా. టెక్నికల్ కమిటీ రిపోర్టు ప్రకారం అపోలో హాస్పిటల్ గ్రూపు తగిన సామర్థ్యం కలిగి వుంది. అయితే ప్రభుత్వ పరిశీలనలో అపోలో గ్రూపు పోటీలో లేకుండా పోయింది. అది వేరే విషయం.

### వివాదాల పుట్ట

సాధారణంగా ప్రభుత్వపరంగా తీసుకునే అతిపెద్ద నిర్ణయాలు మంత్రి మండలి సమావేశంలో చర్చించి నిర్ణయించడం ఆనవాయితీ. జేగురుపాడు విద్యుత్ కేంద్రం కేటాయింపు సమయంలో కూడా మంత్రి మండలే నిర్ణయం తీసుకుంది. కాని వెయ్యి మెగావాట్ల కృష్ణపట్నం విద్యుత్ కేంద్రం, 500 మెగావాట్ల రామగుండం విద్యుదుత్పాదన కేంద్రం ఏర్పాటు విషయంలో ప్రభుత్వ పరంగా ముందుగానే నిర్ణయం తీసుకొని లాంఛన పూర్వక ఆమోదం కోసం మంత్రి మండల్ని ముందుంచారు. ఈ నెల 25 వ తేది మంత్రి మండలి సమావేశం వుండగా వారం క్రితం అంటే ఈ నెల 18 వ తేదినే ముఖ్యమంత్రి స్థాయిలో టెండర్లను ఏ కంపెనీలకు ఇవ్వాలన్న నిర్ణయం తీసుకొని ఆ కంపెనీలకు లెటర్ ఆఫ్ ఇంటెంట్ జారీ చేశారు. ఆ తర్వాత ముక్కుబడిగా ఈ నిర్ణయాన్ని మంత్రి మండలి ఆమోదం కోసం పెట్టడంతో అపోహలకు దారి తీసింది. మంత్రి వర్గ సమావేశం మరో వారం రోజుల్లో వుండగా హడావుడిగా కీలకమైన నిర్ణయాన్ని ఎందుకు తీసుకోవాల్సి వచ్చింది? అదే ప్రశ్నను ఆర్థిక మంత్రి రోశయ్య కూడా లేవనెత్తారు. వ్యవధి లేనందున ఇలా చెయ్యాల్సి వచ్చిందని అధికారులు సమర్థించు కుంటున్నా వారం రోజుల్లో మునిగి పోయేదేముంది నన్నది మిలియన్ డాలర్ ప్రశ్న?

### కృష్ణాపట్నం విద్యుత్ కేంద్రం విభజన

వెయ్యి మెగావాట్ల విద్యుత్ ఉత్పాదన కేంద్రంతో పాటు, ఉత్పత్తికి అవసరమయ్యే బొగ్గును చేరవేసు కోడానికి వీలుగా కృష్ణాపట్నంలో ఓడరేవు (క్యాప్టివ్ పోర్టు) ను సదరు కంపెనీయే నిర్మించు కోవాలి. అంటే వెయ్యి మెగావాట్ల కేంద్రాన్ని ఏ కంపెనీ అయితే ఏర్పాటు చేస్తుందో ఆ కంపెనీయే సొంతంగా ఓడరేవును నిర్మించుకొని తద్వారా ఓడల్లో బొగ్గును చేరవేసుకోవాలి. కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన అనుమతిలో కూడా ఈ నిబంధన వుంది. ఈ మేరకే వెయ్యి మెగావాట్ల కేంద్రానికి టెండర్లు పిలిచారు. కానీ కేటాయింపు కొచ్చేసరికి వెయ్యి మెగావాట్లను రెండుగా (2 x 500) విభజించి చెరొక కంపెనీకి అప్పజెప్పారు. కేంద్ర ప్రభుత్వం అనుమతి లేకుండా ఈ విధంగా రెండుగా విభజించటం హేతు బద్ధం కాదన్న వాదన వుంది. ఈ విషయాన్ని ఎవరైనా కోర్టులో సవాలు చేస్తే టెండర్లు తక్షణం రద్దయ్యే ప్రమాదం వుందని నిపుణు లంటున్నారు. ఇదే అనుమానాన్ని మంత్రి పి. జనార్ధన రెడ్డి కూడా వ్యక్తం చేశారు. కాగా విద్యుత్ కేంద్రాన్ని రెండు భాగాలుగా విభజించటం వల్ల ఓడరేవు నిర్మాణం సందేహంలో పడింది. మొత్తం కేంద్రాన్ని ఒకే కంపెనీకు కేటాయిస్తే అదే కంపెనీ ఓడరేవు నిర్మాణం చేసుకుంటుంది. కాని ఇప్పుడు రెండు కంపెనీలకు కేటాయించడం వల్ల ఓడరేవు ఎవరు నిర్మిస్తారు? ఇద్దరు కలిసి నిర్మిస్తారా? అది సాధ్యమయ్యే పనేనా? తదితర ప్రశ్నల్ని మంత్రి మండలి సమావేశంలో మంత్రులు లేవనెత్తినా వాటికి స్పష్టమైన జవాబు లేదు. కృష్ణపట్నం విద్యుత్ కేంద్రం పనిని పనిగట్టుకొని విభజించింది ముఖ్యమంత్రి తన బంధువులకు ఇచ్చు కోవడానికే నని ప్రతిపక్షాలు గగ్గోలు పెడుతున్నాయి.

### ముఖ్యమంత్రి కన్నెర్ర

కృష్ణపట్నం థర్మల్ కేంద్రం టెండర్ల విషయంలో అనూహ్యంగా తలెత్తిన వివాదానికి ముఖ్యమంత్రి హతాశు లయ్యారు. మంత్రి మండలి సమావేశంలో కూడా ఆయన గరమ్ గరమ్‌గా వున్నట్లు భోగట్టా. టెండర్ల వివాదాన్ని ప్రస్తావించిన మంత్రుల్ని ఆయన మందలించారు కూడా. ఈ విషయంలో గొడవకు దిగితే ''తీవ్ర పరిణామాలు'' ఎదుర్కోవాల్సి వస్తుందని ఒక దశలో ముఖ్యమంత్రి తన మంత్రి వర్గ సహచరుడు పి. జనార్ధన రెడ్డిని మందలించారు. ముఖ్యమంత్రికి, మంత్రులకు మధ్య ఈ విధంగా ఎప్పుడూ వాతావరణం వేడెక్క లేదు.



## పిసిసి

మొదటి పేజీ తరువాయి

అధ్యక్షుడిగా కొనసాగే పక్షంలో పార్టీ, ప్రభుత్వం రైలు పట్టాల మాదిరిగా దూర దూరంగా వుండే ప్రమాదం వుంది. ప్రధాన మంత్రి కావాలనే ఇలా చేస్తున్నారా? రాష్ట్రంలో ఇబ్బందులు పడు కుంటున్న ముఖ్యమంత్రి, పిసిసి అధ్యక్షుడితో ఎన్నికల సమరాన్ని ఎలా చేస్తారో ప్రధానికే ఎరుక. ఇలా వుండగా కాంగ్రెస్ పార్టీలో ముఠా తగాదాలు ముదిరి రచ్చన బడుతున్నా ప్రధాన మంత్రి మాత్రం ప్రేక్షకుడిలా చూస్తూ ఊరుకుంటున్నారే తప్ప కిమ్మనటం లేదు. పార్టీలోకి మూలస్తంభాలైన ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి, మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధన రెడ్డి, లోకసభ సభ్యుడు డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి ముగ్గురూ మూడు దారులుగా వున్నారు. పార్టీలో అందర్నీ కలుపుకుని పోవాల్సిన ముఖ్యమంత్రి కావాలని తన ప్రత్యర్థులన్ని గిల్లి వైరం పెంచుకుంటున్నారు. దీంతో రెచ్చిపోయిన వై.ఎస్. బహిరంగంగానే రాష్ట్ర ప్రభుత్వ పని తీరు అధ్వాన్నంగా ఉందని ఉతికి ఆరేస్తున్నాడు. నేదురుమల్లి మాత్రం బయట పడకుండానే ముఖ్యమంత్రికి ఢీకొనే ప్రయత్నంలో వున్నాడట. ఎలాగూ ఎన్నికలు వస్తున్నాయి కాబట్టి ఒకరి ప్రయోజనాలను మరొకరు దెబ్బ తీసే ప్రమాదం ఎంతో దూరం లేదు. ప్రత్యర్థుల్ని ఓడించేందుకు కోట్ల విజయభాస్కరరెడ్డి సర్వశక్తుల్ని సమీకరించటం కొత్తేమీ కాదు. 1983 లో నేదురుమల్లిని వెంకటగిరిలో ఓడించడం వెనుక కోట్ల వారి పాత్ర అందరికీ తెలిసిందే.

రాష్ట్రంలో పార్టీ తగలబడే సూచనలు స్పష్టంగా కన్పిస్తున్నా నీరో చక్రవర్తి మాదిరిగా ప్రధాని మాత్రం నాన్పుడు తీగను మీటుకుంటూ హస్తినలో ఆనందిస్తున్నాడు. కనీసం సొంత రాష్ట్రం అన్న ఆసక్తి కూడా ఆయనలో కనిపించటం లేదు.

### ఒన్ మాన్ షో

మజ్జి తులసీదాస్ మాత్రం తానింకా పిసిసి అధ్యక్షుడినే నని ప్రకటించు కుంటున్నాడు. ఎన్నికలయ్యే వరకు తనను మార్చబోరన్న గట్టి నమ్మకంతో ఆయన తన పని తాను చేసుకు పోతున్నాడు పిసిసి కార్యవర్గం లేకపోయినా, పిసిసి అధ్యక్షుడు సహకరించక పోయినా మజ్జి మాత్రం మడమ తిప్పకుండా ఒంటరి పోరాటం చేస్తున్నాడు. వచ్చే ఎన్నికల్లో పార్టీ తరఫున వ్యవహరించాల్సిన వ్యూహాన్ని రూపొందించడానికి ఈ నెల 18 వ తేదిన సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. అయితే ఈ సమావేశానికి హాజరయ్యే వారు ఎవరు? సమావేశం తీసుకునే నిర్ణయాల్ని అమలు చేసేదెవరో మజ్జికే ఎరుక.

## సినిమా

9 పేజీ కొరవ

విలన్ శ్రీహరి తన అనుచరులతో: ''దీర గంగతి నేను చూశాను శీలం వేసి తె మీరు మార్కొండ్రా!''

బ్రిడ్జిలో పతిలు: ''ముందు బౌలెట్ చెప్పారా?లంగా చెప్పారా? గుండెల మీద చేతులేశారా? ఏం చేశారో చెప్పు!''

ఈ చిత్రం బాగానే ఆడడంతో ఇటువంటి ద్వంద్వార్థ సంభాషణలు తప్పనిసరిగా ఉండాలేమో! అన్న భ్రమను దర్శక నిర్మాతలకు కలిగించే ప్రేక్షకులే నిందార్హులు.

## గ్యాంగ్‌మాస్టర్

9 పేజీ కొరవ

అయిన హీరో చివరకు ఏమీ సాధించలేక పోతాడు. తన బిడ్డ బ్రతికాక, తన వ్యతిరేక గ్యాంగులీడరు చచ్చాక మరో గ్యాంగు లీడర్ తన ఆయుధాన్ని విసర్జిస్తాడు. అందువల్ల సమాజాన్ని మార్చాలన్న మాస్టర్ పుదాత్త ఆశయం ప్రేమికులను కలిపేంత వరకే వినియోగ పడిందని చెప్పవచ్చు. చిత్రంలోని ఎక్కువగా యాక్షన్ సన్నివేశాలు చోటు చేసుకొన్నాయి. తనను మాఫియా మాస్టర్ పిలుస్తున్నాడని లైబ్రరీలో గొడవ చేసే అనుచరుని దారిలో పెట్టే చోట, వి...తికి ముందు బుల్లెట్ గాయానికి గురవ్వడం, ఒక విలన్ చేతిలో బాంబు పెట్టిమరణానికి సిద్ధమైన సన్నివేశాలలో రాజశేఖర్ తనదైన బాణీలో యాక్షన్ ప్రదర్శించాడు. పలు సన్నివేశాలలో కృష్ణంరాజుకు సమవుజ్జీగా నిలిచాడు. మరో విలన్ పాత్ర పోషణలో చరణ్‌రాజ్ రాణించాడు. సపోర్టింగ్ నటుల్లో నర్రా వెంకటేశ్వరరావు ముందుకు నిలిచాడు. ప్రేమికుని పాత్రలో రాజశేఖర్ తమ్ముడు చంద్రశేఖర్ వెనుక బడ్డాడనే చెప్పాలి. గ్లామర్ గర్ల్స్ నగ్మా, వాణీవిశ్వనాథ్, శుభశ్రీ పాటలకే పరిమిత మయ్యారు. పరుచూరి బ్రదర్స్ వ్రాసిన కామెడీ ట్రాక్‌లో 'ఇల్లెక్కి పొల్లిచ్చే గెడ-పెరుగానందస్వామి' మహా సన్నివేశాలకు నవ్వాపుకోలేం.

'రాజీ అని రోజుకో జెండా ఎగుర వేయను ఇది రాజకీయం కాదు. త్యాగమూర్తులను బ్రతికి వుండగా రాళ్లతో కొడ్తారు; చచ్చాక శిలావిగ్రహాలు కట్టిస్తారు'' అన్న డైలాగులు బాగా పేలాయి. వేటూరి వ్రాసిన 'మిసమిస లాడే మిస్సందం' 'నగుమోము నగ్మా' పాటల్లో సరసాల పాలు ఒకింత హెచ్చినా రెహమాన్ సంగీత ఝురిలో రెండోసారి వింటే గాని అవి బోధపడవు. సుందరం-తార కంపోజ్ చేసిన నృత్యాలు చిత్రానికి అందంగా అమరాయి కాని, గౌతంరాజు ఎడిటింగ్ చిత్రాన్ని ముక్కలు ముక్కలు చేసింది. స్క్రీన్‌ప్లే లోపం, నిర్మాత టి. సుబ్బరామిరెడ్డి మంచి చిత్రం తీద్దామన్న కోరికను బుగ్గిపాలు చేసింది.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,